నోరు తెరచి అడిగితే
నేరస్థుడంటారు
బిగిసిన పిడికిలిలో సహనాన్ని
అదిమిపట్టుకుంటే
తీవ్రవాది అంటారు
భూమి ఆకాశం కలిసినచోట
భగ్గుమంటుంది మా ఆక్రోశం





# గోరు కొయ్యలు

## దాసరాజు రామారావు

శీలావి

# గోరుకొయ్యలు

దాసరాజు రామారావు

కవిత్వం

మంజీరా రచయితల సంఘం

మెదక్ జిల్లా

గోరుకొయ్యలు
దాసరాజు రామారావు
కవిత్వం

---

ప్రచురణ : మంజీర రచయితల సంఘం
- మెదక్ జిల్లా

ముఖచిత్రం, కవర్ డిజైన్ : శీలా వీర్రాజు

అక్షరాల కూర్పు : శ్రీ సాయి షామిలి గ్రాఫిక్స్
2-2-1090/ఎ/9, గోల్నాక
హైద్రాబాద్ ఫోన్ : 7561442

ముద్రణ : చరిత గ్రాఫిక్స్
చిక్కడపల్లి హైదరాబాద్
ఫోన్ : 7607361

ప్రతులకు : **విశాలాంధ్ర బుక్ హౌస్**
(అన్ని బ్రాంచీలలో)
బాంక్ స్ట్రీట్, హైదరాబాద్ - 1.
: **నవోదయ బుక్ హౌస్,**
ఆర్యసమాజ్ ఎదురుగా, బడీచౌడీ,
హైద్రాబాద్ - 1.
: **శ్రావ్య పబ్లికేషన్స్,**
బి-22, మధురానగర్, హైదరాబాద్ - 38
: దిశ పుస్తక కేంద్రం,
చిక్కడపల్లి, హైదరాబాద్ - 20
: **పల్లవి పబ్లికేషన్స్**
బి-22, మధురానగర్,
హైదరాబాద్ - 38

పదిహేను రూపాయలు



*నన్నెప్పుడూ*

*సజీవ కవిత్వం గా*

*మలుస్తున్న*

*మట్టి పోరు సంస్కృతికి....*

## ......................ఎప్పటికీ......................

- 75లో అనుకుంటా. కవితల కట్ట ముందుపెట్టి, ఆశీస్సులడిగాను. శివునాజ్ఞ కాలేదు పుస్తకం పుట్టలేదు. రెండు మూడేళ్ళ నుండీ 'పుస్తకం వెయ్యని అపరాధి'లా నిలదీయడం నాకు గర్వమే! బెరుకు బెరుగ్గా కదిలే నా పుస్తకాన్ని అవ్యాజమైన ప్రేమతో, తన 'సహృదయ పీఠిక' పైకి చేర్చుకొన్న, ఖైరతాబాదు రోడ్లని చీలుస్తూ, 'ఏమ్మా వెనుకబడ్డావా?' అంటూ 'కవిత్వమై' నడిపించిన ఆదిగురువు శివారెడ్డి గారినీ -
- అడుగులై, నుడుగులై కలెగలిసిన సహచరుడు అప్పుడే మూడంతస్తు లెక్కేసి, నన్నూ, 'ఎత్తున' వుంచాలని 'ఆత్మ గల్ల చెయ్యి'ని అందించినా, రాలేనని సతాయిస్తే, "ప్రజల పాలు కావలసిన కవిత్వం, చెదలపాలు చేస్తావా?" అంటూ మమ'కారం'గా అలిగీ, మాట్లాడననీ, లేతగా నొప్పించి, ఒప్పింపజేసి 'కవిత్వం-పుస్తక" మయ్యేంతవరకు 'ప్రాణహిత' అయిన నందిని సిధారెడ్డి నీ -
- 'మీ రొక్కరే మిగిలారు సార్' అంటూ ఎప్పుడూ మారని బాణీలో హొరెత్తించే 'పుస్తకం పాట' పాడిన 'బహుకళల సోపతి' దేశపతి శ్రీనివాస్ నీ -
- తొలినాళ్ళలో కలిసి రాసుకున్న నా కవితాపంక్తుల్లాంటి కందుకూరి శ్రీరాములూ, కె. అంజయ్య, మహమూద్ పాషా లనీ -
- నన్ను 'పుస్తకం'లో చూసుకోవాలని ఆరాటపడే మంజీర కవి మిత్రులనీ -
- ముఖ పరిచయం లేకున్నా, అడిగిందే తడవుగా మనసు కుంచెతో, ఆత్మీయ రంగులద్ది విలువైన ముఖచిత్రానిచ్చిన అమృత హస్తాల అక్షర, చిత్ర శిల్పి - శీలా వీర్రాజు నీ -
- కాలయాపనకి అర్థం తెలియకుండా పుస్తకాన్ని అపురూ పాత్మకంగా ప్రింటించిన చరిత(గ్రాఫిక్స్ (చిక్కడపల్లి) సుబ్బయ్య గారినీ - స్వేద పరిమళాలను జత పరచిన ప్రెస్ కార్మికుల నీ-



- నాకవిత్వానికీ, ఉద్దీపనలకీ దగ్గరగా మసలే జర్నలిస్టు మిత్రులనీ - ఉపాధ్యాయ స్నేహితులనీ -
- తొలిరోజుల్లో నా కవితలను ప్రచురించీ, పరోక్ష ప్రోత్సాహ మందించిన పత్రికాధిపతులనీ- ఆకాశవాణినీ - కవితలను వెనక్కిపంపి, 'కవినయ్యే పట్టుదల' ను పెంచిన భారతినీ, ఆంధ్రజ్యోతి నీ-
- నా కవిత్వానికి మురిసీ, "అమెరికాకు పోయి, డబ్బు పంపిస్తా, పుస్తకం వేసుకోండి" అని ఏనాడో, 'అందుకోలేని ఆకాశం పండు' లాంటి మాట....వరసకే అన్నా, ఇటీవల నిజం చేసుకొన్న స్వాప్నిక వాస్తవురాలు, అద్భుత జీవిత భాగస్వామి విజయ నీ -
- అప్పుడప్పుడెప్పుడో చదువుతూ, ఫెయిర్ చేస్తూ 'దీని అర్థం ఏమిటి నాన్నా'? అంటూ నా కవిత్వాన్ని అమాయకంగా ప్రశ్నించే నా కంటి మెరుపులు శ్రావణి, శ్రీదేవి, సృజన్ లనీ -
- తన మీద 'పోయెం' రాయించుకోగలిగిన అమ్మనీ -
- చెబుతుంటే వినీ, ఊహల్లో చిత్రించుకొంటూ, బ్రతికించుకొంటున్న బాపు నీ-
- చిదిమితే 'కన్నీళ్ళు' గారే దుర్భర బాల్యానికి ఒడిపట్టి - బువ్వయి, చదువయ్యి, సాంప్రదాయ కవిత్వాసక్తి బీజమయ్యిన కీ॥శే॥ మాచాపురం హన్మంతరావు పెద్దబాపునీ -
- పడుతూ లేస్తూ పరిగెత్తుతూ ఆగుతూ వెక్కిళ్ళు పడుతూ ఓదార్చుకుంటూ కలమే సాక్షాత్కారంగా చేయూత పొందుతూ ఇప్పటికీ చిద్రం చేయకుండా మిగిలిపోయిన నా నివాస ఏకాంతాన్నీ -

## ............. యాజ్జేసు కుంట! ..............

గజ్వేల్, జనవరి 2001 — దాసరాజు రామారావు

# ఇన్నాళ్ళకి.......

పొడవగా, పొడవగా యిన్నాళ్ళకి దాసరాజు రామారావు కవితా సంపుటి బయటికి తెస్తున్నాడు. మూడో కవితా సంపుటి వెలువ రించాల్సిన వయసులో మొదటి కవితా సంపుటి బయటికి తెస్తున్నందుకు ముందుగా రామారావుని అభినందిస్తూ నాలుగు మాటలు - రాయటం కదా అంటే, రాస్తున్నాడు, వచన కవిత్వంతోపాటు పాటలూ - బహుచక్కని పాటలూ రాస్తున్నాడు; అయితే ఒక బెరుకు, ఒక బిడియం, ఒక మొగమాటం - దూసుకెళ్ళే తత్వం కాదు నిశ్శబ్దంగా తన దోవన తను వెళ్ళే తత్వం. మెత్తదనం తన తత్వంలోనే తప్ప కవిత్వంలో గాదు. కవిత్వంలో చెప్పాల్సినవి నిక్కచ్చిగానే చెబుతాడు; అనాల్సినవి నిర్భీతిగానే అంటాడు. అక్కడ భయం లేదు. రాజీ కూడా లేదు. ముక్కుసూటితనమే.

తెలంగాణాలో పుట్టి పెరుగుతున్న కవి - దేనికీ అంటీ అంటనట్టు వుండే అవకాశమే లేదు. నూటికి, కోటికి, ఒక సౌందర్య వాదో, వ్యక్తివాదో ఉంటాడు; అటువంటి 'నీరో'లు తెలంగాణాలో తక్కువ. అటువంటి జబ్బు బయటనుంచి రావాల్సిందే తప్ప; సంక్రమిస్తే తప్ప సహజంగా తెలంగాణా జీవితంలో లేదు; ఉండనిచ్చే పరిస్థితులూ లేవు; మారుతున్న దృశ్యాలు, ఊరు మారుతున్న దృశ్యాలు తనకళ్ళముందే వున్నాయి. సకల విధ్వంసాలు తన కళ్ళముందే జరిగిపోతున్నాయి. జీవితంలోనూ, జీవన విధానంలోనూ చొచ్చుకొస్తున్న ప్రమాదాలు తనకు తెల్సు. ఊరు ఊరు గాకుండా పోవటం, మనిషి మనిషిగాకుండా పోవటం - అన్ని విలువలు ధ్వంసమైపోవటం - ముఖ్యంగా సాంస్కృతిక జీవనం కల్లోలమయిపోవటం - బాహిరమూ కావచ్చు అంత ర్గతమూ కావచ్చు; రాజకీయ సామాజిక విధ్వంసాల మధ్య, సాంస్కృతిక విధ్వంసం - జన జీవన సాంస్కృతిక విధ్వంసం, ముఖ్యంగా ప్రమాదకారిగా పరిణమిస్తున్న తరుణంలో మరింత వేదనాకారకమౌతుంది.

ప్రతికవికీ అదే జీవితం, అదే సమాజం, అదే వస్తువు. అంతా దృష్టి మీద ఆధారపడివుంటుంది. అంతా నీ కోణం మీద - అంతా నీ రాజకీయ, సామాజిక, సాంస్కృతిక విశ్లేషణ మీద ఆధారపడివుంటుంది. ప్రతిదీ కవిత్వమే - అది నీలోంచి దూసుకొచ్చినప్పుడు, నీముద్ర, నీవ్యక్తిత్వం దానికంటు



కుంటుంది. నీ అనుభవమే నీ అనుభూతే, నిన్ను లాగి, నిన్ను involve చేసే process; సామాజిక శక్తి ఏదో, రాజకీయ శక్తి ఏదో తెల్సుకోవాల్సిన అవసరం కవికి వుంది. యాభైయేళ్ళ స్వాతంత్ర్య జీవితం తర్వాత విధ్వంస దృశ్యాలే ఎందుకు మిగిలాయో, దేశాన్ని క్రమక్రమేణా అమ్మే అవసరం ఎందుకేర్పడిందో తెలుసుకోవాల్సిన అవసరం కవికి ఉండాలి. ఏ కవన్నా అడగటం లేదు అంటే, అడగటానికి నిరాకరించాడంటే, అతను యధాతధ వాది అయి, ఉన్న system లో భాగమయి, ఈ స్థితికారకుల్లో పరోక్షంగా చేరుచున్నాడని అర్థం. ఈ గొడవంతా ఏమిటయ్యా- కవిత్వం ఒక అనుభావ్ని వ్యక్తీకరించటం గదా - అని నువ్వు అడిగితే - సమస్త విధ్వంసంగానీ, విలువల పతనం గానీ లోపలా, బయటా; అది జరిపే దాడిగానీ తన అనుభవంలో భాగంగాదా అని అడగాలి. అసలు లోపలి విధ్వంసాన్ని, వ్యక్తిత్వ విధ్వంసాన్ని, ప్రాంతీయ, సామాజిక, సాంస్కృతిక విధ్వంసాన్ని పట్టించుకోకుండా ఎలా వుండగలుగు తున్నాడు కవి అన్నది ప్రశ్న. శత్రువు నీ ఇంట్లో వున్నాడు, వంటింట్లో వున్నాడు, పడకటింట్లో వున్నాడు, నీ పిల్లలు చదివే చదువులో వున్నాడు, నవ్వు తింటున్న తిండిలో వున్నాడు, కొంటున్న మందుల్లో, ఎరువుల్లో, క్రిమిసంహారక మందుల్లో, విత్తనాల్లో, పంటలో, పత్తి పంటలో వున్నాడు. నీ జీవితాన్ని, నీ అనుభవాన్ని విషతుల్యం చేస్తున్న శత్రువును గమనించక పోతే కవిత్వం కొత్తపుంతలు తొక్కదు విస్తృతమవ్వదు, అంతర్గతంగా వ్యాపించదు. లోతునీ, గంభీరతనీ సంతరించుకోదు.

కవిత్వం, ఉత్తమ కవిత్వమయ్యే, గొప్ప కవిత్వమయ్యే క్రమమొకటి వుంది. నిర్దిష్టమయి, నిర్దిష్టంలో నిర్దిష్టమవుతున్న దశలో - కవిత్వం అన్ని మూలల్లోకి, మూలాల్లోకి చొచ్చుకెళ్లి, అన్నీ పార్శ్వాల్ని అందుకుంటుంది.

దాసరాజు రామారావు వీటంటికీ స్పందిస్తూనే వున్నాడు, నిత్య జాకరూకతతోనే వున్నాడు, నిత్య చలన శీలతతోనే వున్నాడు విప్లవ శీలత తోనే వున్నాడు.

"మల్లెతీగల అనుబంధం అప్పటిపల్లె
నాగటిచాళ్ళ వికసిత దరహాసం అప్పటిపల్లె
అమాయకపు ఆశల వెర్రిబాగుల్ది అప్పటి నా పల్లె"

ఎవరేంచేశారో గానీ
ఇప్పుడు నా పల్లె తలకిందులే అయ్యింది" అని అని

"అన్ని విధాల
ధ్వంసమయిన పల్లెని
ధ్వంసం చేసిన వాళ్ళని
అక్షరాల్తో చెక్కుకుంటూ పోవటమే
అచ్చయిన కవితనం" అనీ అన్నాడు.

'సాయుధ కలలు' అనే కవితలో

"వస్తూనే వుంటారు
వూర్లోకి వాళ్ళు
చీకటి గుడ్లను చిదుముకుంటూ
భుజాన వెల్తురు కాల్వల్ని మోసుకుంటూ -
ఉత్సాహం కిరీటాలు ధరించి -
ఆహ్వానిస్తాయి తురాయి పూలు -
...... ...... ...... ...... ......

మనం అన్నమౌతాం
దుప్పటై ముసురుకుంటాం
వాళ్ళ ముఖాన చిర్నవ్వు
మనమీద నమ్మకాన్ని చాటుతుందనగా
అడుగుల అనుభూతులు విడుస్తూ
నిష్క్రమిస్తారు వాళ్ళు"

అని ముగుస్తుంది కవిత.

"మారుతున్న కాలాన్ని
చత్వారపు కళ్ళ జోడుతో దర్శించలేక
.......................................................
వాస్తవాల రెండు చేతుల్ని కాదని"

అంటూ ధ్వంసం చేయతగిన వ్యక్తిని" గురించీ మాట్లాడ తాడు. వేదాంతుడు అనే కవితలో.

"మాకు తోడుంటే రామసక్కని కల అయ్యింది
మా కన్నీళ్ళను తుడిచే కడకొంగు అయ్యింది"
రామసక్కని కల నాగలి - 'కూలిన నాగలి' ఎందుకయ్యింది



"వైట్‌హౌస్ రంకెలకు భయపడో
చాతకాని, నిరంకుశ
ప్రభుత్వానికి నీరసపడో
మా నాగలి కూలిపోయింది
సాపిస్తూ
సాపిస్తూ" అని ముగుస్తుంది.

సాపిస్తూ, సాపిస్తూ అనటంలో కవితకొక కొత్త తీవ్రత చేరింది. 'కరపత్రం' అనే మరో మంచికవితలో

"చెట్టు మీద పిట్టవాలినట్టుగా
నా చేతిలో కరపత్రం
ఎక్కణ్ణుంచొచ్చిందో తెలియదు
ఎలా వచ్చిందో అంతు చిక్కదు
పరిశుభ్రమయిన పొద్దుటి పూటలా
కలం పట్టగానే మెరిసే కొత్త వాక్యంలా
నా చేతిలో కరపత్రం"

అని మొదలయిన 'కరపత్రం' అనే కవితలో ప్రస్తుత తెలంగాణా అల్లకల్లోల స్థితిని వివరించి

"గిర్రున తిరిగిన కన్నీటితో
ముఖాని కద్దుకున్నా కరపత్రాన్ని
బొటనవేలితో, బొట్టు
దిద్దుతున్నట్లనిపించింది"

'అమ్మమ్మ' మా వరండా' అనేవి చాలా మంచి కవితలు. మార్పు - అన్ని రకాల మార్పు వ్యక్తినిష్టమయి, కౌటుంబిక నిష్ఠమయి, సామాజిక, రాజకీయ, సాంస్కృతిక సందర్భ నిష్టమయి దర్శనమిస్తుంది. దాన్ని పట్టుకుని కవిత్వీకరించాలి. ప్రతి కవికీ కవిత్వీకరించే పద్ధతి ఒకటుంటుంది. రామారావుకీ ఉంది. నిరలంకారంగా కథ చెప్పినట్టు చెబుతూ అలా పొరలు పొరలుగా విడమర్చుకుంటూ పోతాడు. తనలానే తన కవిత కూడా unsophisticated గా, చాలా సరళంగా హాయిగా వుంటుంది. వస్తు ప్రాధాన్యతే ముఖ్యం. కావాలని తెచ్చిపెట్టే మెరుపులుండవు. కవిత్వీకరించే పద్ధతిమీద తగినంత దృష్టిపెట్టడా అన్నంత సింపుల్‌గా, సూటిగా వుంటుంది కవిత. అది ఆయన పద్ధతి.

గత పదేళ్ళలో జాతీయంగా, అంతర్జాతీయంగా జరుగుతున్న ఘటనలకి, మార్పులకీ, సంక్షోభాలకి, సందర్భాలకీ సంవేదనలకీ తను కదిలిన దాఖలాలు ఈ సంపుటిలో మీకు కన్పిస్తాయి. తను చలనంలోనే వున్నాడు. చలన శీలతతోనే వున్నాడు. దృష్టి, దృక్పథమూ ఆరోగ్యవంతంగానే, వామపక్ష ప్రజా జీవన చైతన్య కారకంగానే వున్నాయి.

దగ్గర దగ్గర నలభైదాకా వున్న కవితలన్నీ చదివితే చుట్టూ వున్న జీవితం, సమాజం మానవ సంబంధాలు, వాటి పరిణామాలన్నీ ప్రత్యక్ష మౌతాయి. కవి ఆక్రోశం, ఆర్తి, ఆగ్రహం, మార్గం అన్నీ వ్యక్తమౌతాయి. ప్రతికవితనీ ఉదాహరించాల్సిన అవసరం లేదు. మెతుకుసీమలో జన్మించిన కవి కవిత్వంలో, కొన్ని మెతుకుల్ని పట్టి చూశానంతే.

పాట వేరు, వచన కవిత వేరు. రామారావు పాటలో పోయిన పోకడలు వచన కవితలో పోలేదు. పోలేదు, అంటే, పెట్టాల్సినంతగా దృష్టి పెట్టలేదా? వస్తు వైవిధ్యముంది; వస్తు వైవిధ్యమొక్కటే చాలదు. 'గాఢత' అవసరం. 'గాఢత' అంటే పాఠకుణ్ణి కవితలో మగ్నంచేసే ఒక లక్షణం. పాఠకుణ్ణి, కవితలోకీ, కవిత్వ వాతావరణంలోకి లాగే ఒక గుణం. అలా కవిత లేకపోతే, పాఠకుడు అనాసక్తంగా వుంటాడు. యిన్నేళ్ళ తర్వాత రామారావుకి యివన్నీ చెప్పాల్సిన పనిలేదు. తనకి తెల్సు చుట్టూ వస్తున్న కవిత్వాన్ని చూస్తున్నాడు. తను మనసుపెడితే అదేం పెద్ద కష్టమయినదేమీ కాదు. తనకి శిల్ప రహస్యాలు తెల్సు. దృష్టి పెట్టాలంతే.

మెదక్ జిల్లా, మంజీరా రచయితల సంఘం నేపథ్యంనుంచి వచ్చిన కవుల్లో ముఖ్యుడు రామారావు. ఆలస్యంగానైనా కవితా సంపుటి తెస్తున్నందుకు మనసారా అభినందిస్తున్నా -

కె. శివారెడ్డి
*12 జనవరి, 2001*
హైద్రాబాద్.



## ఊబి

ఒక మృత జీవన శరీరాన్ని మోస్తూ
ఒక భ్రమ విశ్వాసాన్ని గర్భగుడిలో పదిలపరచుకొంటూ
కాలాన్ని పుల్లలు పుల్లలుగా విరిచేస్తూ
సువిశాల సుందరమయ జీవితక్షేత్రాన
ఒక దిష్టిబొమ్మలా నిరాశ -
కళ్ళలో చూపుల సెలయేళ్ళూరవు
మనసుకీ బతుకుకీ ప్రసారాలుండవు
చిరిగిన షర్టు జేబులో నలిగిన రూపాయినోటులా
జీవితం మిగుల్తుంది
గొంతు లోయలోకి మాటల మూట జారిపోతుంది
కలం నోట్లో పచ్చి వెలక్కాయలా గడ్డకట్టిన
సిరా చుక్కై -
ముందర నిలువెత్తు నిల్చొన బ్రహ్మరాక్షసిలా
భయపెడ్తూ -
అడుగు తీసి అడుగు వెయ్యటానికి
ఆవులించే బద్ధకం
ఉచ్ఛరించే రెండు శబ్ద తీరాల మధ్య
దట్టంగా విస్తరించే మౌన సముద్రం

నిద్రలోనూ కలలపాటల్ని కొనుక్కోనివ్వదు
తొలకరిలో ఒళ్ళు విరుచుకునే మక్కకంకుల్ని
వేడి వేడిగా కాల్చుకోనివ్వదు
నిలబడీ నిలబడీ నిలబడ్డట్టుగానే -
కూర్చుండీ కూర్చుండీ కూర్చున్నట్టుగానే -
మంచం మీద పరుండి, ఇంటిపై కప్పులో
కళ్ళు పెట్టి, ఎక్కడెక్కడో తిరిగి వచ్చినట్టుగానే -
గొప్ప వస్తువూ అయిన, అన్నిటికీ మూలమూ అయిన
బతుకునే మరిచి పోయినట్టుగానే -

*భారతి.*
*7 / 1989*



# అతను

అతను కనబడుతుంటాడు
అప్పుడప్పుడు -
అంగట్లో తప్పిపోయిన కుర్రాడికి మల్లే
తపాలా గుద్దులు తింటూ తరుమబడిన కార్డు లాగే
మోసుకెళ్ళే చాకలి భుజం మీది బట్టల మల్లె లాగే
చంటి పిల్లాడు చింపి పోగులు పెట్టిన
పుస్తకం లాగే
దేశపటం చుట్టూ ఉన్న సరిహద్దు
గీత వంకర లాగే
అతికించిన ఉత్తరం లా
ఎంతకూ అర్థం కాడు
గోడకున్న అద్దంలా తనలోకి చూస్తే తప్ప
కనిపించడు
క్యాసెట్‌లో పాటై, తీగలో కరెంటై
చీకటి గోడల నినాదమై దాక్కుంటాడు
లాగి వదిలిన బాణం లా అటో యిటో
రోడ్డు ప్రవాహంలో పడి కొట్టుకు పోతుంటాడు
సెంటర్లో నన్ను చూసినప్పుడల్లా

అతని పెదాలు
రెండు కత్తుల్లా విచ్చుకుంటాయి
మొహం మోహరించిన యుద్ధరంగంలా
వుంటుంది -

మాట్లాడుతుంటే
వ్యవస్థను లాగి చెంపదెబ్బ కొట్టినట్లే -
దాగివున్నంత మాత్రాన
ఒరలోని కత్తి పదును కోల్పోతుందా....?

*ఆదివారం ఆంధ్రపత్రిక*
*10-9-1989*



# శ్వేత అహంకారం

నల్లవాడా!
విచారం ప్రకటించకు -
తెల్ల 'ధనాల' చెల్లని మనసుల ముందు
విచారం ప్రకటించకు తలొంచి -
చిన్న చూపుతో కెలుకుతున్నప్పటికీ
చిన్న బుచ్చుకోకు
బానిస కుబుసం విడిచేసి
చూపుడు వేలిపై
ఆత్మ విశ్వాసం నిలబెట్టు

అగ్ర రాజ్యమే కావచ్చు
ధీర గంభీర సుస్సంపన్న, అణ్వాయుధ
సముద్రులే కావచ్చు
అయితే ఏమిటి?
నల్ల ప్రాణాలకీ, తెల్ల ప్రాణాలకీ
వివరణ అవసరమొచ్చిందా?
మూడుకోట్ల ఆఫ్రికన్ కార్మికుల చెమట చుక్కలే
వాళ్ళను కడిగి కడిగీ
తెల్లగా చేసిందని మరిచారా?

'ప్రతి ఫలాలు' పూయాల్సిన చేతులు
మేళ్ళు మరచి
ఐరన్ ముద్దలై చెలరేగుతున్నారు
"నల్లవాసన' వీచడానికి వీల్లేదని
ఇంటిముందు
భయాత్మకశిలువ హెచ్చరిస్తుంది
లుకాస్ ప్రొఫెసర్ రంగుల్లేనిప్రేమ
చితక్కొట్టి తరిమేయబడటం -
డెట్రాయిట్, ఫ్లోరిడా వీధులు
నల్ల రక్తాలతో ముఖాల్ని వెలిగించుకోవటం -
ఎక్కడ పడితే అక్కడా
కుక్లక్స్ క్లాన్ అంపం నోళ్ళు
తెరచుకొని వెంటాడుతుండటం -

ఏ శిఖరాగ్ర భాగాన మిమ్మల్ని
కూచోబెడుతుందో చెప్పు అమెరికా?
రోడ్నీకింగ్‌పై జరిపిన పైశాచిక చర్య చూసి
ఏ వీడియో కన్ను భగ్గున మండిందో
నీ పరువెంత కాలిందో ఎరుగవా!
జెస్సీ ఒవెన్సీని భుజం తట్టి
కరచాలనం చేయలేని మీ అధ్యక్షుల వారి
చేతులెంత మురికై వున్నాయో చూసుకొన్నావా ?
మహమ్మదాలి బంగారు పతకాన్ని



నదిలో గిరాటేసినపుడు
మీ కీర్తిపుట్టి నిండా మునిగింది

గుగీ అక్షరపు అలలహోరు మీరు సహించరు
టైసన్ ముష్టిఘాత విన్యాసాలపై పెదవ్విరుస్తారు
కొలంబస్
అమెరికాను కనుగొన్నాడో
జాత్యహంకారాన్ని కనుగొన్నాడో
తేలడం లేదు
నల్లవాడా
విచారం ప్రకటించకు
లింకన్ లూథర్ కింగ్‌ల కల
పండించటానికి
జెస్సీ జాక్స్ నున్నాడు
అతని వెంట మీ నల్లటి తిరస్కారం
ఎర్రగా మండుతూ
దారంతా వెలుగౌతుంది
సెంట్ లూయిస్ విభజన రేఖ
విధ్వంసమయ్యే రోజు దగ్గరౌతుంది

నల్ల నల్లని నల్లవాడా

అప్పుడు మ్లానమైన తెల్లముఖాల ముందు
నీ విచారం సుదీర్ఘంగా ప్రకటింతువు గానీ....!

*27-07-1993*

(అమెరికనులు తమ దేశంలోని నిగ్రోలని చిత్రహింసలు పెడ్తారని చదివి....)

# నా పల్లె

తాడు చుట్టి
ఝూంమ్మని తిప్పితే
తన చుట్టూ తాను గిరగిరా నిశ్శబ్దంగా
తిరుగుతున్న బొంగరం మల్లే
నా పల్లె
వుండేది ఒకప్పుడు -
పచ్చని చెట్లు
గర్భపూర్తిగా, 'దయల్ని' వీస్తూ వుండేవి
పక్షులే పల్లెకు వేళలు తెలిపేవి
గాలి పంటపొలాల్ని చుట్టివచ్చి
భోరోసాల్ని వూదుతుండేది
స్నేహంగా మక్కబుట్టల్ని కాల్చి తినిపించేది
సాయంకాలాన రంగురంగుల పశువులు
వూళ్ళోకి వస్తుంటే
ఎగసిన దుమ్ముతో శ్వాస కలుపుకునేది
పశువుల గిట్టల స్పర్శకు
పల్లె నేల పులకాంకిత మయ్యేది
పారుతున్న ఏటి కాలువ



పల్లెను కడిగిన ముత్యంలా వుంచుతుండేది
కట్టమీద బుడ్డ గోచీల పోరగాళ్ళ
చిర్రగోనె ఆటలకు
చెరువు అలల్తో గలగలా నవ్వేది
కొత్తగా ఎవరైనా వూళ్ళోకి అడుగుపెట్టినప్పుడు
వాళ్ళ కడుపు పట్టి

ఆకలి దప్పుల్ని తడిమేది
కన్నీటి పాటకు రాగమై పెనవేసుకునేది
ఆడాళ్ళందరు గుంపులు గుంపులుగా
బతుకమ్మ ఆడుతున్నప్పుడు
పల్లె కళ్ళల్లో 'సహజీవనం' అలుగయ్యేది
పల్లె రచ్చబండ పొత్తిళ్ళలో
పెద్దా చిన్నా కలబోసుకునే సన్నివేశం
నగిషీలు చెక్కిన ముఖచిత్రమే -
వూరి వాళ్ళందరూ చేతులు కలుపుకుంటూ
పాలపిట్టను - చూడ్డానికి వెళుతుంటే
నిండైన చెరువు
చాంతాడంత మల్లె మొగ్గల హారమై
స్వాగతించేది
మల్లె తీగల అనుబంధం అప్పటి పల్లె -
నాగటి చాళ్ళ వికసిత దరహాసం అప్పటి పల్లె -

అమాయకపు ఆశల వెర్రి బాగుల్ది అప్పటి నా పల్లె -
తియ్యటి స్వప్నంలా మొదలైన నా పల్లె
రాను రానూ పీడకలలా పీక్కుతింటోంది
ఎవరేం చేశారో గానీ
ఇప్పుడు నా పల్లె
తల్లకిందులే అయ్యింది
ఇక్కడి పైర్లు
రాజకీయ గొలలు వేస్తున్నాయి
ఇక్కడి కుంపట్లు
మత జ్వాలల్ని ఎగదోస్తున్నాయి
మమతలు వెదజల్లని కాగితప్పూల బతుకమ్మలే
ఆడుతున్నారిక్కడ -
యాటకత్తి
దసరా పండుగని ఒక్కవేటున
నరుకుతోందిక్కడ -
నలుగురు గుమిగూడిన చోట
రచ్చబండ బద్దలౌతోంది
ఇక్కడి చేన్లు
లేత మక్కబుట్టల స్నేహ హస్తాలు
అందించడం లేదు
గాలి కదలికలు మొరటుగా
తగులుతున్నాయి



అన్ని విధాలా
ధ్వంసమైన పల్లెని,
ధ్వంసం చేసిన వాళ్ళని
అక్షరాల్లో చెక్కుకుంటూ పోవడమే
అచ్చమైన కవితనం !

ఆదివారం ఆంధ్రప్రభ
1-5-1994

# సాయుధ కలలు

వస్తూనే వుంటారు
పూర్లోకి వాళ్ళు -
చీకటి గుడ్లను చిదుముకుంటూ
భుజాన వెల్తురు కాల్వల్ని మోసుకుంటూ
ఉత్సాహపు కిరీటాలు ధరించి
రెక్కల హస్తాలతో
ఆహ్వానిస్తాయి తురాయి పూలు -

గాలి
సవ్వడులు మాని
ఆత్రంగా వాళ్ళ అక్కున దూరుతుంది
ఎక్కడెక్కడో తిరిగి తిరిగీ -
ఎంతెంతో అలసీ అలసీ -
దాహమై వస్తారు
ఆకలి పేగుల అరుపులై వస్తారు
నెత్తురోడే పాదాల గాయపు ముద్దలై వస్తారు

మనం అన్నమౌతాం
దుప్పటై ముసురుకుంటాం
ఆత్మలతో గాయాల్ని తడిమి
చెమ్మగిల్లిన అశ్రువులతో కడుగుతాం



వాళ్ళ పెదిమల మీద సుళ్ళు తిరిగే
కత్తుల భాషని చదవటానికి
ఉడలాటపడతాం
వాళ్ళు చెప్పుకుంటూ పోతూ
విస్తార మౌతారు
దగ్ధమౌతున్న వాక్యాలౌతారు
అశాంతి పవనాలై
తలుపులకేసి కొట్టుకున్నట్టవుతారు
ట్రిగ్గర్ మీది అసహనపు వేళ్ళవుతారు

ఎర్రజీరలూరి మన కళ్ళు
చారల పులులైతాయి
మన లోలోపలి పగుళ్ళు
నెగళ్ళెత్తుతుంటాయి
కర్రవెంట వాన చుక్కలు కారి
కంకి పుట్టినట్టు
మనం బలిష్ఠులమవుతాం
అరణ్య గర్భంలో నాటబడే సాయుధ
కలలవుతాం
వాళ్ళ ముఖాన చిర్నవ్వు
మనమీది నమ్మకాన్ని చాటుతుందనగా
అడుగుల అనుభూతుల్ని విడుస్తూ
వాళ్ళు నిష్క్రమిస్తారు...!

16-08-1993

# వేదాంతుడు

మారుతున్న కాలాన్ని
చత్వారపు కళ్ళ జోడుతో దర్శించలేక
ముక్కు మీద ఈగ వాలినంత
కోపాన్ని
ప్రదర్శిస్తుంటాడతడు -
వాస్తవాల రెండు చేతుల్ని కాదని
ఛాయా మాత్రంగా నైన
లేని దేవున్ని
ఊహల్లో పరిభ్రమింప చేసుకుంటూ
బతకడం లేనందుకు
బొక్కి నోటితో విసుగు తుంపర
వుమ్ముతుంటాడు
బడి పిల్లల చెలిమి కుస్తీలంటే
నచ్చడు
దూరంగా
వరద పొంగులను చూస్తూ
సంతోషిస్తాడు గానీ
వుద్యమ కెరటాలై ఎగసే



జనదృశ్యాల్ని చూసి హర్షించడు
అల్లుకుపోయిన ట్రాఫికంటే,
రేషన్ షాపుల ముందు పొడవైన క్యూలంటే,
ప్రాణాలు బిగబట్టి లాగుతున్న
నిండు బస్సంటే
గుండె నిండా భయమే
అయినా
పున్నామ నరకం నుండి
పుత్ర సంతానమే
రక్షిస్తుందంటాడు
ఆడది ఆదిశక్తని ప్రవచిస్తాడు
చదువుల కెగబడ్తున్న ఆడవాళ్ళమీదా,
ఇంటితో పాటు ఆఫీసు భారాన్ని
మోస్తున్న ఆడవాళ్ళ మీదా,
గాయపరిచే భర్తలను
నిలదీసే ఆడవాళ్ళ మీదా
సదభిప్రాయం ప్రకటించడు
ఉన్నతులు
ఉన్నతులేననీ,
అధములు
అధములేననీ,
శరీరంలోని అవయవాల పోలికేననీ -

కులవ్యవస్థ
దేవుని తీర్మానమనీ,
పాటించనందువల్లే మహాపాపం పెరిగి
నెలకు మూడు వానలు కురవట్లేదనీ
మూర్ఖత్వపు నశ్యం పీల్చుతూ వుక్రోశిస్తాడు
అంటరాని వాళ్ళు కాగడాలై వెలుగుతుంటే

భూదేవి బద్దలౌతుందని
సంధ్య వారుస్తాడు
రాజకీయ కలహాలు
పురాణాల్లో కూడా వున్నాయంటాడు
ఇంట్లో నానిగాడికి కడుపు వుబ్బితే
మడి ఆచారాల లోపమంటాడు
ఫ్యాక్టరీల కంటే
గుళ్ళూ గోపురాల సంఖ్య ఎక్కువ కావాలంటాడు
అయోధ్యలో రాముడు నిలువకుంటే
ధర్మానికి నాలుగు పాదాలు
చెదలు తిన్నట్టే అంటాడు
'సైన్సు పరిజ్ఞానం'
ఏమీ తెలియని కుర్రాడి లాంటిదంటాడు
పచ్చి కరువైనప్పుడు



వర్షం పడటం కోసం
హనుమాండ్లకు పేడ కొట్టటాన్ని
గట్టిగా సమర్థిస్తాడు
పల్లీయుల మూఢ నమ్మకాల్ని
పురాణసాక్ష్యాల అక్షింతలు జల్లి
వృద్ధి పరుస్తాడు
జీవితం చుట్టూ
భక్తి ప్రపత్తులతో
గాయత్రీ ఔపాసన పట్టందే
ఏ పనీ సాఫల్యం కాదనీ నిర్ధారిస్తాడు
శిరస్సే శాస్త్రీయతగా
హృదయమే మానవీయతగా
కాళ్ళు చేతులే సామాజికతగా
అద్భుత శైలితో అడుగులేస్తున్న
ఈనాటి మానవునిపై కినుక వహించి
కాషాయ చర్మంలో దూరి
సంసారపు కలల సౌఖ్యానుభూతుల
మాలను తిప్పుతూ వుండే

అతడు
బహుధా:
గుర్తుంచుకోదగిన వాడే!

30-09-1993

# చావిట్లో భజన

రాత్రి తొమ్మిదింటికి
తలగడ మీద తల వాల్చేసరికి
చావిట్లో భజన సన్నగా, లయలు లయలుగా
మొదలౌతుంది

మర్మాలు తెలియని పాటల్ని,
పుత్సాహపు రాగాలు మేళవించి,
అమాయకపు గొంతులతో,
ఆనందంగా పాడతారు

పొద్దటి కాయకష్టం
కండల్లో సూదులు గుచ్చి వుండొచ్చు
యజమాని ఎకసెక్కెం
గుండెని పెకిలించి వుండొచ్చు
పొలానికి పట్టిన చీడ
అప్పుల కుప్పల్ని పేర్చి వుండొచ్చు

ఎద్దు చచ్చి నాగలి కూలి వుండొచ్చు
రాళ్ళను ఢీకొన్న పిల్లకాలువ
సందుల్ని చూసికొని పరుగు తీస్తున్నట్టు,
పగటి వెతల్నుంచి పారిపోయి,





రాత్రి ఈ భజన పాటల మధ్య
దాక్కోవడమా....?

ఈ భజన
మీ నాగలి కానికి ఎద్దవుతుందా?
ఈ భజన
యజమానిని కోవాబిళ్ళగా మార్చి
మీ ముందు నిలబెడ్తుందా?

ఎక్కడా ముక్తకంఠం కాని మీ నోళ్ళు,
ఈ 'ఎక్స్‌పైరీ' భజనలో ఏకమౌతాయి
ఎక్కడా అల్లుకోని మీ విశ్వాసాలు,
ఈ రాతి భజన చుట్టూ ఐక్యంగా మూగుతాయి.

ఒక దౌర్భాగ్యపు వ్యవస్థకు గుర్తుగా
చావిట్లో భజన మొదలైంది
వూరి కర్ణపుటాల్లో
స్లో పాయిజన్ లా
దిగుతూ......!

15-11-1993

# పెళ్ళి సంబరం

పెళ్ళి బాజాలు
ముంగిట్లో కాదు
గుండెల మీద బాదుతున్నాయి
ఇంటి ముందు విశాలంగా పరచుకొన్ని
పచ్చని పందిరి కింద
కప్పులా అణుగుతూ
శ్వాస ఆడనట్టే వుంది
ఘడియకో చిన్నగుంపుగా తరలివచ్చే
చుట్ట పక్కాలను రిసీవ్ చేసుకుంటున్నప్పుడు
సముద్రమంత బేజారు ఆవరించుకుంటుంది
కాస్మోటిక్ అందాల సౌరభాలు
ఇల్లంతా గుప్పు మంటుంటే
ఘాటైన కారం కుముటుల్లో ఉక్కిరి బిక్కిరయినట్టే వుంది
గాడిపొయ్యిలు అవయవాల్ని
ఇంధనంగా వేసుకొంటూ
సాటిలేనట్లు ధీటుగా మండుతున్నాయి
ఆయుష్షును పిండుకొని
అందులో దేవినట్టు



వంటకాలు తయారవుతున్నాయి
ఓ తికమకల విశ్వామిత్రా!

"Marriages are made in Heaven" నా? Goodడ్డా? పాడా?
రెండు జీవితాలు ప్రేమగా ఒకటిగా
లీనమవ్వటానికి
ఎన్నెన్ని చెక్క పేడుల్లా ఎగిరి పడాల్సిందో హా...చ్!

విడిదింటిలో ఆత్మని
కార్పెట్‌లా పరిచొచ్చినా
అవమానాలకి అర్హత వుండే
ఆడపిల్ల తండ్రే గదా!
కాళ్ళ కడిగి
కారులో కూచోబెట్టిన
'మనీ ప్రూఫ్' పెళ్ళి కొడుక్కి
కాస్తంతా దయరాదూ ?

జన్మనిచ్చిన తల్లిదండ్రుల ఋణం
తన పెళ్ళినాడన్నా మర్యాదలిప్పిస్తూ
తీర్చుకోవద్దూ మరి!
చెదరిన కలలు
ఎదురుకోళ్ళ దుమ్ములో
ఎక్కడ రాలిపోయాయో వెదుక్కునే తీరికేనా!
గుడ్డిగా
చెవిటిగా

మనసు లేని కంకాళంగా అయినా
చేసుకొంటూ పోవాల్సిందే

పెళ్ళిరంగమంతా పప్పెట్ లా నోరు తెరచుకొని
బఫేని తలపోసుకుంటూ
ఆబగా ఎదురుచూస్తున్నది

అల్లంత దూరాన కళ్యాణ వేదిక
సింగారించుకొన్న వధ్యస్థలిలా వుంది
బుట్టలో కన్న పేగు
బొమ్మలా కదిలి వస్తుంటే
చెమర్చడానికి నాలుగు కళ్ళు, రెండు గుండెలు చాలవూ?

తల్లయినా, తండ్రయినా
ఈ అపూర్వ దృశ్యం కోసమే
ఎన్ని కాట్లయినా కరిపించుకునేది

మాంగల్యం తంతు ముగిసింది
అక్షింతల వాన వెలిసింది
బఫే అయ్యాక
సందడి తగ్గాక
ఖాళీ క్రాకరీని సర్దుకోవడానికి
పీటల మీంచి
పిల్ల తండ్రి ఎంతకూ లేవడేం....!

*ఆంధ్రజ్యోతి డైలీ (నవీన)*
*16-2-1998*



# ఓ రెండు క్షణాలు

ఎంతాశ్చర్యం!
రెండే రెండు క్షణాల కున్న శక్తి
ఓ జీవితమంతా అయితే -

తల మీద వాలిన కాకినైనా తోలలేని
చౌరస్తా విగ్రహంలా వుండటం -
చీకటి గోడ మీద
బొగ్గుతో రాసిన నినాదంలా
మరుగున పడటం -

ఆగి ఆగి కొట్టే వాన డల్లులా
విపరీత మవ్వడం -
అన్నిట్లో వేలు ముంచి మరకలు
మిగిల్చడమూ -
అన్నీ గమనించే వుంటాడతడు
అన్నివైపులా విచ్చుకొన్న సూర్యపుష్పం లాంటి
వాడు గదా
కులాసాగా అతని ముంగిట్లో
నన్ను పరచుకొన్నాను
బేలగా పెదవులు కదిపాను

అతడు అనంతకాలం లోంచి
రెండే రెండు క్షణాల్ని తెంపి,
మాటల్లోకి అనువదించి
నా మీద వేశాడు భూమ్యాకాశాల్లా -

కరిగి కరిగీ
నలిగి నలిగీ
ఒత్తుకునీ ఒత్తుకునీ
దగ్గరి కయ్యాను
పరిపక్వమయ్యాను

ఇవతలి కొస్తూ
ఇంటిదాకా అనుకొన్నా

"ఆ రెండు క్షణాలూ,
వాటిని దొర్లించిన ఆ మనిషీ,
సల్లంగ వుండాలనీ....!

(మానసికంగా బాగా నలిగిన ఒకానొక సందర్భంలో)

3-3-1994



# మా వరండా

బతుకు నిండా పరచుకొన్న ఈ వరండాని
విప్పటానికి
ఎంత యాతన నైనా పడతాను
తేనెలో వేలు ముంచి
చప్పరిస్తున్న జ్ఞాపకాలు
ఈ వరండాలో కోకొల్లలు.

రాత్రి కబుర్లతో
అటూ యిటూ దొర్లుతూ,
ఆలస్యంగా పడుకొన్నప్పటికీ,
పొద్దు లేవక ముందే నిద్ర లేచేది
చీపురు దువ్వెనతో తల దువ్వుకునేది
నల్లని బార్డర్ గల తెల్లని పట్టుబట్ట
చుట్టుకొని
ఫ్రేమ్‌లో బిగించిన అద్దంలా మెరిసిపోయేది.

నా చిన్నప్పుడు
నాన్న వీపు గుర్రమెక్కి - ఆడిందీ
ఈ వరండా మీదే
నా బారసాల నాడు

వచ్చిన చుట్టపక్కాలను
తన ఒళ్ళో కూచో బెట్టుకొని
విందు భోజనాలు తినిపించిందీ వరండాయే

ఆడుతూ పాడుతూ
మల మూత్రాలను విడిచినా
కసురుకునేది కాదు
నా పెళ్ళిలో వరండా సందడి
అంతా ఇంతా కాదు
పెళ్ళి పెద్ద తనే అయ్యింది
తీపి తీపి దాంపత్యపు రుచులెన్నో
వరండా మీదే దిద్దుకొన్నాం
నాన్నగారి సంగీత కచేరీలు
మా యువ కవి సమ్మేళనాలు
చెవుల్లో గింగురు మంటున్నా భరించేది
ఆత్మకు ఆత్మీయతలా
ఈ ఇంటికి మా వరండా!
ఇంట్లో అందర్ని కలిపి
దండలా గుచ్చేది
అతిథి తోడు లేకుండా
ఒక్కనాడైనా ఒంటరిగా
గడిపేది కాదు ఈ వరండా



మూలకు కూచోని కన్నీరు కార్చిన ఘడియా
దానికి పట్టలేదు

ఇప్పటి వరండా పరిస్థితి వేరు

విశాలపు దుఃఖ ప్రవాహంలో
ఒంటరి పడవలా కొట్టుకుపోతుంది
ఎంతెంత మంది పదముద్రల్లో తనను చూసుకొని
తృప్తిపడ్డ వరండా
ఇప్పుడు
ఒంటి కాలి చెప్పులా ఎవరికీ
పనికి రానిదైంది
ఈగలు దోమలు కసువుతో
దీర్ఘరోగిలా వరండా మిగిలింది
అవునూ !
నాకు కుష్ఠు వచ్చాక
మెల్లమెల్లగా నా వాళ్ళంతా నాకు దూరమౌతూ
వరండాకి దూరమయ్యారు
ఇక మాకెవరున్నారు?
వరండాకి నేను,
నాకీ వరండా -
ఇద్దరికీ
చెరొకరం మిగిలాం

నా కుక్కి మంచం కాళ్ళ కాడ పడుండీ
వరండా నన్ను ఓదారుస్తున్నప్పుడు
ఏ మనిషి ముఖమైనా
దాని మెట్ల మీద పడి
సిగ్గుతో చితికిపోదూ....!

ఆదివారం ఆంధ్ర భూమి
22-3-1998



# అమ్మమ్మ

ప్రేమ పండి అమ్మ అయ్యిందేమో
అమ్మ పండి అమ్మమ్మ అయ్యిందేమో
అమ్మ కన్న సంతానానికి
అమ్మమ్మ పురిటి నొప్పులయ్యింది
పసిపిల్లల ఆటపాటలకు
అమ్మమ్మ ఒడే తెరచిన ఆకాశమయ్యింది
చిట్టి కథలూ,
ముద్దు మురిపాలూ,
నవ్వులాటలూ
అమ్మమ్మ అందించిన గోరుముద్దలు -
నాకు బాగా గుర్తు
ఒంటి గంటకు
బడి నుండి ఇంటికొచ్చేసరికి
నిద్రపోయే తను
కంటిరెప్పల వీధి వాకిలి తెరచి
కంచంలో పెరుగన్నమై
ఎదురు చూసేది
ఎవ్వరి కంట పడకుండా

పాలగోకు మాధుర్యం నోట్లో వేసేది
అమ్మ తిట్లు నాకు తగులకుండా
తన ఆత్మతో అడ్డుకునేది
నాన్న దెబ్బలు నాపై పడకుండా
తన శరీరంతో నన్ను కప్పేది
రాత్రి
నడి జామున లేచి
పాడు దమ్ముతో పోరు సల్పుతూ
ఎవ్వరికీ నిద్ర భంగం కాకుండా
జాగ్రత్త పడేది
విసుక్కున్నా
ఇంటి విషయాలన్నింటిలో తల దూర్చేది
ఇంటి చుట్టూ,
యావత్ కుటుంబం చుట్టూ
రక్షణ వలయమై నాటుకొనేది

అనారోగ్యం అమ్మమ్మను
కొంచెం కొంచెంగా తినేయడం మొదలైంది
ఎంత చాత కాకున్నా
తన పనులు తనే భరించుకునేది
ఆరాటమే గానీ,
అలుపెరుగని మనిషి ఆమె
గతించిన రోజులకీ,
గడిచే రోజులకీ
బేరీజు వేస్తూ వగచేది



'ఒక యుద్ధ వాతావరణం' లోకి
మేము
నెట్ట బడుతున్నామేమో' అన్న ఆందోళన
ఆమె కళ్ళల్లో సుడులు తిరిగేది
తాత గురించి అడిగితే
'నిన్ను చూసుకుంటుంటే
తాత జ్ఞాపకమే రావడం లేదురా' అనేది
కీర్తనలు పాడుతూ,
జైల్లో రామదాసు పడ్డ కష్టాలకు
కళ్ళు ఒత్తుకునేది-
దయా
ప్రేమా
అమ్మమ్మ శ్వాసలు -
అలాంటి అమ్మమ్మ
ఒకరోజు విపరీతంగా శ్వాసిస్తూ శ్వాసిస్తూ
గాల్లో కలిసి పోయింది
నేను దర్శించిన
అమ్మమ్మ చితిమంట నా బతుకు పొడుగునా వెలుగిస్తూనే వుంటుంది
'అమ్మమ్మ తనాన్ని
ఈ లోకానికి అందివ్వడానికి
తక్షణం మనం అమ్మమ్మల మౌదామా.....!'

28-12-1994

# దళిత స్వరం

దొరా!

శెప్పులు మోపిచ్చుకున్నది సాలక
శెప్పుతో తన్నినవ్
మొద్దులు కొట్టి కొట్టి
శేతుల గీతలు పోయి పొక్కులు మొలిచినయ్
రెండు జాముల యాల్ల అయినా
నా ఆకలిపేగుల మూలుగులు
నీ కినబడలేదు
ఎండలో కచ్చరం ముందు
వురికించి
దయతో నువ్విచ్చిన 'బ్యాడ' తో
ఏమికొనాలో, ఏమి తినాలో
ఈ మట్టి బుర్రకు అర్థం కాలే-
'మా చిట్టెమ్మ పెళ్ళి కదా' ని
పెయ్యి పుండు పుండు అయ్యేదాకా
పని జేసి
వుషారుగ డప్పు సప్పుడు జేస్తుంటే, పట్నం బ్యాండు వాళ్ళ ముందు
గదమాయించినవ్



మీ ఇంట్ల సాకిరి చేసే
నా ఆలిని
ముండా లంజా అని తిట్టి,
బేయిజ్జత్ చేసినవ్
పారేసే బట్టలను దాన మిచ్చే
ధర్మ పెబువులు మీరు
తిట్లతో బతుకంతా కనపడని గాయాలు
సేసింఁడ్రు
మూడునూర్ల అప్పు అడిగితే
మూడడ్డల పాలం 'రైన్' పెట్టమన్నరు
సంకల పలకతో చెంగలిస్తున్న సంటోన్ని
గోదల కాడికి తోలుమని 'సక్తు' చేసిండ్రు
అరమైలు పాలం దున్ని
రొప్పినప్పుడు,
నెల రోజుల కల్లాలు రెప్ప ఆల్పకుండా
కావలి కాసినప్పుడు,
పది నాగళ్ళ కసువు దొడ్డి
వూడ్చినప్పుడు,
నాలుగు దివాణాల పక్కలు
ఎత్తినప్పుడు,
ముఖాలకు, పాయఖానాలకు
నీళ్ళు మోసినప్పుడు,

మీరు బాగానే మురిసింఁడ్రు కావొచ్చు!
పగటేల మగత తన్ను కొచ్చి,
మాగన్ను పడ్డప్పుడు,
కయ్యమంటూ లేపి
'సుఖమొచ్చినదిర నీ యవ్వ' అన్నప్పుడు,
నా మనసెంత నీల్నీల్లు అయ్యిందో
సోంచాయించింఁడ్రా?
ఎంగిళ్ళూ, పాచన్నాలూ పెట్టినప్పుడు,
'కఁర్రోడు, ముట్టరానోడు' అని నల్గురికి చెప్పినప్పుడు,
శాద బావిలో పూడిక తీసి
పైకెక్కుతూ,
పట్టు దప్పి జారిపడితే
సూది మందైనా ఇప్పించ లేనప్పుడూ
మా గరీబు తనాల ముందు
కొంచెపోల్లయింఁడ్రు మీరు!

గోదలు ఎవరి శేన్లో పడ్డయని
బుడ్డోని తోడపట్టి
కంట్ల నీళ్ళు ఇగిరే దాక
విడిచి పెట్టని ఘట్టాలూ కండ్లల్ల ఆడుతునే వున్నయి

తల వొంచడమే గానీ
తల పట్టి ఎన్నడైన ఆలోచించినమా!



కలుక్కుమన్న మనసుతో
వొడి తిర్గినం గని
ఎదురు తిర్గినమా!
తాతల కాలంనుంచీ
మీ సేవ జేస్తుంటే
ఏం సంపాదించుకొన్నం దొరా
వొదాలని బండ పాకుర సొంటి
చాకిర్లు తప్ప,
వొడి తిరిగిన శరీరాల ఉబ్బిన నరాల
ముడతలు తప్ప
బాధపడటం మా బతుకైందయ్యా
బాధపెట్టటం మీ దర్జా అయ్యిందయ్యా

అంబెద్కరా! అంబెద్కరా!
నీ చూపుడు వేలు
ప్రశ్నగా వెంటాడుతున్నది

ఇంకాగదూ
మాల మాదిగ కులాలు చేతులల్లుకుంటున్నాయ్
డప్పుల దరువుల్లో పాడె సంగీత
మొలుకుతున్నది-
హరిజనవాడే తూర్పు దిక్కయ్యేది
నువ్వొద్దే నువ్వొద్దే!

28-3-1996

# తన వాళ్ళకి దూరంగా

నాలుకకు మాటకు నడుమ,
పువ్వుకు పుప్పొడికి నడుమ,
చినుకుకూ భూమికీ నడుమ
అఖాతాల ఆరాటాల్ని భరించగలమా! చెప్పు!
వయ్యారాల వరిపైరును చూస్తూ
పొద్దు గడపందే
రైతు మనసు కుదుట పడదు
గాలి పెట్టె గిలిగింతలకు
పడి పడి నవ్వే వికసిత వదనాల
పూల ఆనందం అంతా ఇంతా కాదు
ఆకాశం పిచ్చోడు
మేఘావృత పిల్లల వలయంతో
కేరింతలు కొట్టే సన్నివేశం
ఎవరి కళ్ళకైనా జిగేల్ మనిపిస్తుంది
ఒక ప్రేమ
ఒక విశ్వాసం
ఒక చాచిన చెయ్యి
ఎంత అద్భుతమనీ.....
ఉద్యోగమో



వ్యాపారమో
మరే జీవన ధర్మమో
వెంటాడి వెంటాడి
తరిమి తరిమి కొడుతుంది
శరీరం నుండి గుండెని
వేరు చేసినట్లుగా-
ప్రియమైన స్పర్శ, ఆత్మీయతల నుండి
గొలుసు లేసి లాక్కెల్లుతున్నట్లుగా-

స్వప్న విమానాల్లో తేలిపోతున్నా,
స్విచ్ లేసి సుఖాలు వెలిగించుకుంటున్నా
కాకి పాడుస్తున్న ఎద్దు పుండే అవుతుంది
ఒంటరితనం-
కనీస మొక
పాత పిలుపు
పరిచిత ముఖం కోసం
దాహార్తిగా తపించి పోవడమే మిగుల్తుంది

అంతరాత్మ సాక్షిగా
తన వాళ్ళకి దూరంగా బతకడం,
ఓటమి నెదుర్కొంటున్న
సాహసకృత్యమై
నిలుస్తుంది....!

అమెరికా భారతి
3/99

# తురాయి పూలు

మేం
వంటింట్లో పొగ చూరిన ఉట్లయి,
వేలాడుతున్నం
కుక్క ముట్టిన అన్నపు బొగోన్లయి
పనికిరాని వాళ్ళ మయినం
గలీజును సాపు చేయడానికి
పనికొస్తం గానీ
మీ గల్లీలల్ల వుండడానికి
పనికి రాం
రెండు చేతులెత్తి 'దండం' దొరా అంటే
మీ కిష్టమే గానీ
మా చేతులు మీ చేతుల కలవడం
మీ కొప్పుకోరు
మా దేహాల్ని దున్ని, సమస్తం పండించి
మీ ఒళ్ళో పోసి
'మోడెం' కొయ్యలుగా మిగిలిపోయినం
రెండు బుక్కల కోసం
ఉన్న పొద్దంతా సరిపోనోళ్ళం



దిగులే మా గుడిసయ్యింది
బుగులే మా బతుకయ్యింది
మా కోసం ఏదేదో చేస్తామని
చెప్పినప్పుడల్లా
మేము ఓట్లేసే గంగెద్దులమని
గుర్తొస్తూ వుంటుంది
మట్టి పొరల్లో మా ఆత్మను
కూరుకొని
ఆకాశాన్ని దీనంగా వేడుకొనేటోళ్ళం

మీ రెట్లా శ్రీమంతులయ్యారో
మేమెట్లా దరిద్రులమయ్యామో
ఏ చెట్టు మీది ఏ కాకైనా
అరచి అరచి మరీ చెపుతుంది
మీ లాగా ఫోం సోఫాల మీద
కూసునేందుకు,
బటనొత్తి ఇష్టమొచ్చిన బొమ్మ
చూసుకునేందుకు,
ఫోన్ కొట్టి, లక్షలు
సంపాదించుకునేందుకు,
'నాలుగు విందులతో ధర్మ ప్రభువై
పోయేందుకు

మాకేం వాతనవుతుంది?

ఒకళ్ళ నెత్తి మీది బరువును

ఒకళ్ళం ఎత్తుకునేటోళ్ళం

వాడకట్టు ఇల్లు తగులబడుతుందంటే

మా ఇల్లు సంగతి మరిచిపోయి,

మా కన్నీళ్ళతో ఆర్పటానికి ఉరికొచ్చేటోళ్ళం

మా కత్తితోనే మమ్మల్ని పొడిచి

మమ్మల్నే దోషులుగా చిత్రించే

మీ తెలివితేటలు

మా కెక్కడి నుంచి వస్తాయి?

మీరు కోట్లు సంపాదించినా,

కోట్లు ఎగవేసినా

ప్రభుత్వం మిమ్మల్ని 'మర్యాదస్తులు'గానే చూస్తుంది

మేం కూలి పెంచుమన్నా

బిల్లులు కట్టలేకపోయినా

బేడీలతో యూనిఫాం

డ్యూటీ బెల్టు బిగించుతుంది

నోరు తెరచి అడిగితే

నేరస్థుడంటారు

బిగిసిన పిడికిలిలో సహనాన్ని

పరీక్షించుకుంటుంటే

తీవ్రవాది అంటారు



భూమి ఆకాశం కలిసిన చోట

భగ్గుమంటుంది మా ఆక్రోశం

మమ్మల్ని ఏం చెయ్యాలో

వెయ్యిన్నొక్క ఆలోచనలతో

పథకాలను సిద్ధం చేసుకొంటారు మీరు

అయితే ఏం?

అన్ని కాలాలు మీవి కావు

రేపటి కాలం మా అరచేతుల్లో

రూపు దిద్దుకొంటోంది...!

27-07-1996

# అమరుడా సారో!

నీళ్ళు తాగినా దాహం తీరనివాడు
పెట్రోలు తాగుతాడు
పెట్రోలు తాగినా దాహం తీరనప్పుడు
ఒగోని ప్రజల ధన, మాన, ప్రాణాల్ని
ఆబగా జుర్రుకుంటాడు
అధికార పీఠానికి చికాకులు
కలిగించేవన్నీ
'నిషేధపు చట్టాలు' గా కోరలు సాచుతాయి
ప్రజల మీదే ప్రేమ
లేనివాడు
పర్యావరణాన్ని ఎలా ప్రేమిస్తాడు?
తల చుట్టూ
డబ్బు సంచుల కలలు
వలయాలుగా అందంగా తిరుగుతున్నప్పుడు
షెల్‌కూ, అబాచా కూ
కళ్ళు బైర్లే కమ్మి వుంటాయి

ఓ నల్ల గుండెల నైజీరియా!
మీ దేశంలో కనీసం రెండు మార్లైనా



స్వచ్ఛమైన గాలిని పీల్చుకో గలిగామా?
మా పొలాల్ని, నదీమ తల్లిని,
చివరకు మా బతుకుల్ని
కాలుష్యపు వరదల్లోకి తోసి
పబ్బం గడుపుకొంటున్నావా?

బుల్లెట్లను కాపలా పెట్టుకొని
నియంత విర్రవీగుతూ వుండొచ్చు

సారో వెదజల్లిన అక్షరాలు
వృథా కావు వృథా కావు
అబాచా! అబాచా!
సారోని కదిలించి పొరపాటు
చేశావు
సారో అంటే
"మోసాప్' ఒక్కటే అనుకున్నావేమో!
సారో కందిరీగల తెట్టె

ప్రపంచ జనం
సారో ఉరి మీద
ప్రమాణం చెయ్యడానికి
సిద్ధంగా వుంది....!

29-07-1996

# కూలిన నాగలి

మాకు తోడుండే రామసక్కని కల
అయ్యింది
మా కన్నీళ్ళను తుడిచే కడకొంగు
అయ్యింది
కరడు గట్టిన శెల్క భూమిని
పిండి పిండిగా దున్ని పెట్టింది
ఎరుపెక్కి వడలి పోతున్న
మక్క చేన్ను చూస్తూ దిగులుగా వుండిపోతే
రేపటి ధైర్యాన్నిచ్చి ఆదుకొంది
కాడి మీదేసుకొని రెండెద్దులు
మెల్లగా లాక్కెళుతుంటే
సాల్లు సాల్లుగా పులకరించిపోయింది
మా చేతులతో నాగలి
పట్టుకొన్నప్పుడు
లోకం మొత్తం బొచ్చె గుద్దుకుంటూ
దీనంగా చేతుల్ని అల్లాడిస్తూ
వేడుకున్నట్టుంటుంది
మా భుజాల మీద నాగల్ని



మోస్తూ నడుస్తున్నప్పుడు
అమ్మ తన బిడ్డలకు గోరుముద్దలు
తినిపిస్తున్న దృశ్యం
మా పెదవులపై విజయగర్వంగా మెరుస్తుంది.

నాగలి పట్టీ పట్టీ
నాగలి మోసీ మోసీ
నాగలి దున్నీ దున్నీ
నాగలి మా కొక అపురూపమైంది
నాగలి మా శరీరంలో ఆత్మీయమైన
ఒక అవయవమైంది
మా బంధాలన్నీ
నాగలి బంధాలే
మా కులాలన్నీ
నాగలి కులాలే
నేల మమ్మల్ని తాకి
పరవశించిపోతే
మేం నాగల్ని తాకి
పరవశించిపోతాం
మమ్మల్ని నిరందిగా వుంచే
నాగలి మీద కష్టాలెక్కుపెట్టడం మొదలైంది

దయగల్ల ప్రభువులు
మాయలోన్ని పిలిపించి
మా జాగల మీద,
మా నాలుకల మీద,
మా నాగలి నొసలు మీద
సంతకాలు చేశారు
ఇకనుండీ రుసుం చెల్లించకుండా
మనసారా భూమిని ముద్దాడడానికి వీల్లేదు

తనివి దీరా నాగలి చుట్టూ అశలై
అల్లుకోడానికి వీల్లేదు
వైట్‌హౌస్ అంకెలకు భయపడో,
చాతకాని, నిరంకుశ
ప్రభుత్వానికి నీరసపడో
మా నాగలి కూలిపోయింది
సాపిస్తూ....
సాపిస్తూ....!

'యువత' మాసపత్రిక
4/98



# జులుం

చాక్లెట్లడిగామా,
బిస్కెట్లడిగామా,
పాల బుగ్గల మీద పాయసాల ముద్దు లడిగామా
చిర్రగోనె ఆడుకోడానికి మీ కపురూపమైన
లాఠీకర్ర నడిగామా,
దొంగా పోలీ సాటకు మీకు గర్వాన్ని పెంచే
ఎర్ర టోపీ నడిగామా!
ఎందుకు సార్
మా మీద ఫెయిలైన ఎన్‌కౌంటర్లంతటి కోపాన్ని
ప్రదర్శిస్తారు?
మా అంగి లాగుల్ని మడత పెట్టుకోడం
రాని వాళ్ళం
అమ్మ పక్కను ఎడబాయని వాళ్ళం
నాన్నని తప్ప అందర్నీ
'అంకుల్' అని పిలుచుకునే వాళ్ళం
పోలీసంకుల్! మా బాల్యాన్ని మోరీల పాల్జేసి
ఎలా హింసించారూ?
టీచర్ సాయం లేకుండా క్లాస్ పుస్తకాల్నే
అర్థం చేసుకోలేం

మీ డ్యూటీ లేమిటో ఎలా అర్థమవుతాయి
మాకు ?
మీ యఫ్.ఐ.ఆర్‌ల అంతరంగాల ఆంతర్యాలేమిటో
ఎలా పసిగట్టగలం?
చీకటి గదుల్లో కూరి, అమలు పరిచే
రకరకాల చిత్రహింసల వెనుక
మీ పతకాల మెరుపులేమిటో
ఎలా ఆరా తీయగలం?

మా కేం తెలుసు మీ గురించి?
మా కింతే తెలుసు!
మమ్మీ డాడీలు మా చెవుల్లో పోరేది
చదువనే తెలుసు
మీ లాగా చదివి
దేశచక్రం తిప్పాలని
కలలు గంటున్నాం
మా కలల్ని వెలిగించుకోడానికే
కరెంటడిగాం
ముందు ముందు మీ లాంటి యూనిఫాం
ఆదర్శాన్ని ధరించడానికే
మా చిన్ని యూనిఫాంలు
క్రమశిక్షణతో ర్యాలీ తీసింది



మాకు జరిగిన ఘోరానికి
సార్లే కాదు
ఎవరు మాత్రం ఏం జేస్తారు?
కరుణ వున్నవారు కాసిన్ని కన్నీళ్ళు పెడతారు
జాలి వున్నవారు జల జలా పొంగుతారు
ఆగ్రహమున్నవారు మీ చతురతకి వెర్రచి,
మూడోకన్ను తెరవడం మానేస్తారు
పోలీస్ దొరలారా!
మీ భుజం మీది మూడు పట్టీల సాక్షిగా
మోరీల పాలైన మా స్కూల్ బ్యాగుల్ని
వెనక్కెళ్ళి
తెచ్చుకో దలచుకోలేదు మేం -

పాత స్కూళ్ళను వదిలిపెట్టి
కొత్త పాఠాల్ని నేర్చుకోడానికి
మా ర్యాలీ కొనసాగుతుంది....!

03-09-1996

*(17-8-96 రోజున మెదక్ లో పరీక్షల సమయంలో కరెంటు కోసం, పాఠశాల విద్యార్థులు ర్యాలీ తీస్తున్నప్పుడు పోలీసుల లాఠీచార్జిని నిరసిస్తూ....)*

# విదేశీ టోపీ

తల మీద టోపీ పెట్టడం
అలంకార ప్రాయమౌతుంది
బతుక్కి టోపీ పెట్టడం
నరక ప్రాయమౌతుంది.

అందమైన కలల కుచ్చుటోపీలను
అమ్మకానికి పట్టుకొస్తారు
మరింతగా ముందుకు జరిగి
మనింట్లో పసందైన మల్టీ మీడియాలను
ఉచిత సేవలతో వడ్డిస్తారు

రూపాయి కర్ర మీద
డాలర్ టోపీ బోర్లిస్తారు

మన మట్టి పాతదైందని
కంప్యూటరైజేషన్ చేస్తామంటారు

మన వేప చెట్టు నరికి
కుండీలో, 'బోగస్ విల్లా' ను నాటి
మనకు కల్చర్ నేర్పుతుంటారు
ఫాస్ట్‌ఫుడ్ సెంటర్లు తెరచి



ఆకలి ఎన్ని రకాల రుచులుగా వుంటుందో
వర్గీకరించి చూపుతారు
తెలుగు భాష ముతక వాసనేసేదనీ,
ఆంగ్ల లేబుల్ అంటించుకుంటే
స్టేటస్ ఫీలింగ్ కలుగుతుందంటారు
సరిగ్గా మనమిక్కడే మోసపోయి,
జారిపడుతుంటాం
మనపై 'షుగర్ కోటెడ్ దోపిడీ'
జరుగుతూ వుంటుంది

మన పేదరికం మనల్ని లోతుగా ఆలోచించనివ్వదు
పేనుతున్న తాళ్ళు ఉరి కోసమేనని
మన మూహించుకోలేం

గ్లోబలైజేషన్ ముసుగు కప్పి
లోన మంట పెడుతున్నారు

ఒక పూట గడిచి, మరోపూట గడిచే యాతన
మనకుంటే
ప్రపంచ పటాన్ని అందుకొని, మెడలో వేసుకోటానికి
ఇంటర్‌నెట్ నిచ్చెనలు వేస్తున్నారు
భూమికీ ఆకాశానికీ అంతం చూపెట్టగలమేమో
గానీ
అమెరికా ఆశకి అంతు కనిపెట్టగలమా?

అందరి వీపులమీద, నాల్కల మీదా
తన సంతకమే చెక్కుతూ వుంటుంది

పురిటి నొప్పులు మనవే అయినా
పుట్టిన బిడ్డ మీద హక్కులు తన వంటుంది
కోయిల మనదే అయినా
కోయిల పాట మీద హక్కులు తన వంటుంది
శరీరం మనదే అయినా
మేధస్సు మీద హక్కులు తనకే అంటుంది
బతుకు మనదే అయినా
బతికే శైలి మీద హక్కులు తనవంటుంది
పడగ విప్పిన 'పెత్తనం' కోరలు
పెరికి వేస్తేనే గానీ
దాని బుస చావదేమో!
తీర్మానించుకునే సమయం
మన చేతుల్లో తీరుబడిగా
వేచి చూస్తూ వుంది....!

'చూపు'
జనవరి - ఏప్రిల్ - 1997



# కల్లం

మనసు లాంటి మట్టిని వేళ్ళతో దున్నుకోవడమే
తన వంతయ్యింది
రక్తాన్నొంపుకొని విత్తనాలుగా నాటుకోవడమే
తన వంతయ్యింది
తొట్టెలో పసికూనలా చేనును సాక్కోవడమే
తన వంతయింది
ఎలిగి పోతున్న ఎన్నీల పుల్లలా మెరిసిపోతున్న
పైరును చూసుకుంటూ
కళ్ళలో గొబ్బెమ్మలు నిలుపుకోవడమే
తన వంతయింది
గూట్లోని ఆశలన్నీ గాలిపటాలై ఎగురుతుంటే
ఆపుకోవడం కష్టమే అయింది

ఈడొచ్చిన పిల్లకు పెళ్ళి చూపులుంటాయని
తెలుసు
పండొచ్చిన పంటకు పెళ్ళి చూపులుంటాయని
ఎరుగడు పాపం
కల్లమైన పంట చుట్టూ యమకింకరులు

కాచుకొని వున్నారు
బిడ్డకు పెళ్ళి చేసి అత్తారింటికి పంపినట్టుగానే,
పంటనంతా వాళ్ళ చేతుల్లో పోసి, ఎండిన గడ్డి మోపులా
సోలిపోయాడు
ఏం మిగిలింది?
ఏ ముందని మిగలడానికి?
బీటలు వారిన బీడులాంటి మనసు తప్ప,
చావు కళ విహరించే కొల్లగొట్టిన కల్లం లాంటి బతుకు తప్ప-

ఆడపిల్ల ఆడిసొత్తే
ఆరుగాలపు కష్టం అళ్ళసొత్తే
ఎక్కిళ్ళు మింగుతూ ఎదిగించాలి
ఎక్కిళ్ళు పడుతూ అప్పగించాలి

నిద్రలోకి కలల వసంతం వచ్చి,
గిలిగింతలు పెట్టి పోయినట్లు గానే
జీవితం లోకి కల్లాల శోభ వచ్చి....మెరిసి....
మాయ మౌతుంది

అయినా
రైతు సౌభాగ్యం
వేచి వున్న రేపటి కల్లం చుట్టూ
గిరికీలు కొడుతూనే వుంటుంది

తడిపిపెట్టిన పొలం లాంటి ఆశతో!!

ఆంధ్రప్రదేశ్ ఉగాది స్పెషల్
1998



# వివాహ బంధం

అక్షరాన్ని లాగితే కవితంతా
కుప్ప కూలినట్టు
అమాస చంద్రునికి అంతపెద్ద ఆకాశంలో
చోటే లేనట్టు
ఆమె,
ఆమె వివాహ బంధమూను!

చిన్నప్పుడు కన్నవాళ్ళింట్లో ఎదిగింది
కసాయివాడి లాభానికే
మోజు పడి పెంచుకొన్న శిరోజాలు,
పట్టి ఈడ్చటానికి పనికొచ్చాయి
మెరుగులు పెట్టించుకొన్న అందం,
సిగరెట్లతో కాల్చి మరకలు చేసేందుకు
అవసరపడింది
సన్నజాజి కొమ్మలా
సున్నితంగా పెంచుకొచ్చిన శరీరం,
చేతికందిన ఏ వస్తువుతో నన్నా బాధించడానికి
వుపయోగపడింది
కష్టపడి చదివి పట్టుకొచ్చిన ఉద్యోగపు అర్హత,

నెల నెలా జీతం గుంజుకోవడానికి
శీలాన్ని కించపరచడానికి
నెలవయ్యింది
మెడనిండా తాళిబొట్లు వేలాడదీశాక
జీవితంలో వాటికి స్థలమేది?
పుట్టింటి నుండి మోసుకెళ్ళిన గంపెడు కలలు
అత్తవారింటి గోడల మీద మేకులు దిగ్గొట్టిన
చిత్రపటాలైనాయి
దేహాన్ని ముద్దాడిన రోజులే గానీ
హృదయాన్ని ముద్దాడిన రోజేది?
వేద మంత్రాల ఘోషలూ,
పెళ్ళినాటి ప్రమాణాలూ,
బంధాలూ, అనుబంధాలూ,
ప్రేమలు, అనురాగాలూ,
చెల్లిన కాసుల ముందు చెల్లని ముఖాలతో
వెల వెల బోతుంటాయి

ఉన్నంత కాలమూ కాపురంలో నిప్పుల ఉప్పెన
ఆరిపోదు
తమ కళ్ళు మిరుమిట్లు గొల్పడానికో,
తమ సంసారాల్ని తళ తళా తోమడానికో
వివాహ బంధమనే సాంప్రదాయ వలను విసిరి



మోసగిస్తూనే వున్నాడు
మగవాడనే పెళ్ళికొడుకు -
అచ్చంగా నమ్మి, బలి అవుతూనే వుంది
ఆడది
ఒక పెళ్ళికూతురై.....!

22-01-1997

# వానమ్మ

గరిక, చినుకు కిరీటాన్ని
తల దాల్చనే లేదు
కంకి పసిబిడ్డ, వర్షపు చనుబాలను
కడుపారా గ్రోలనే లేదు
పిల్లలు, కాలువల్లో జేరి
వదిలిన కాగితం పడవల్లో విహరించనే లేదు
పక్షి, తన గూడును సవరించుకొనే లేదు

రైతు భుజాన నాగలి
ఎక్కి కూచోనే లేదు

భూమి, తొలకరి పాటలకు
గొంతు సిద్ధం చేసుకోనేలేదు

జోరుగా కురుస్తున్న వాన దృశ్యాన్ని
సూర్యుడు తిలకించనే లేదు

ప్రియమైన మేఘాల్లారా!
అప్పుడే వెళ్ళిపోయారా?
ఖాళీ కడవల్ని చూసి,
కన్నీరు కార్చడానికి వచ్చారనుకొన్నాం



పలుచని గంజిలో నాలుగు మెతుకు
లేసుకొని,
పండుగు చేసుకోవచ్చని ఆశపడ్డాం
ఏవేవో ఆలోచనలకు దారాలు
కట్టుకొని,
ఎగరేసుకొన్నాం సంబరంగా-
ఒక్క పిలుపుకే వచ్చి,
తలుపు తియ్యలేదన్నంత కోపంతో
వెను తిరిగిపోతారా?
వొట్టి బిందెనైనా ఎత్తలేని
చిన్నారులు
వందలకొద్దీ నిండు బిందెలతో
దేవుళ్ళను అభిషేకిస్తున్నారు
పూజలు, ఉపవాసాలు, దీక్షలతో
బతుకులను ముడుపు కట్టుకొంటున్నాం

ఎవర్ని ఏమని అడగగలం?

ఎండిపోతున్న బతుకు తెరువుని
డల్లువై తడిపేందుకు

మా కనుకొలుకుల్లోంచైనా రా....!

04-09-1997

# నా తెలంగాణా

ఎక్కుపెట్టిన వెయ్యిన్నొక్క తుపాకీ మోతల
మధ్యన,
ఎండిపోయిన బీడు బతుకుల పొల్లు కాలాల
మధ్యన,
తొమ్మిది జిల్లాల మోసపోయిన తలరాతల
తెలంగాణని దర్శిస్తున్నా!

కావలించుకొని కన్నీరు తుడుస్తున్న
చెయ్యే అంతటా-

రెండు చేతులతో బొచ్చె
గుద్దుకునే ఆర్తి-
పోలీస్ రచనా వ్యూహాల నెత్తుటి జల్లెడ లైన
పల్లెల కథలు-

కోటి రతనాలను కొల్లగొట్టి
మోడువీణను చేసిన ఆంధ్రా వుషారు-

ఎన్ని గోస లెన్ని గోస లెన్ని గోసలు
విషపు రంగుల్లా చిమ్ముబడి

నా తెలంగాణా అపురూప చిత్రపటాన్ని



నాకు కాకుండా చేస్తున్నాయి?
పల్లె ముఖాన్ని ఒళ్ళోకి తీసుకొని
పసికూనలా ముద్దాడిన రోజులేవీ?
దండకారుణ్యంలో అడవి తల్లి సింగారాల
స్వేచ్ఛాగాన మయూర నృత్యాలెటు పోయినాయి?

ఆడతల్లుల మోహాన
పూరి పెద్ద చెరువంత బొట్టులా మెరిసిన
నా తెలంగాణ ఏమైపోయినాది?

మాట్లాడండి! మాట్లాడండి!!
నోళ్ళు ముసుకొని
పెద్ద మనుషుల ఒప్పందంలో పాతేసిన,
మీ అంతరాత్మల్ని బద్దలు కొట్టుకొని
మరీ మాట్లాడండీ!

చంపిన వీరుని పక్కన తుపాకి పెట్టి
ఫోటో తీసినంత సహజంగా
మాట్లాడండి!!
చిగురించే కల లాంటి తెలంగాణని
కల్లోలితను చేసి
పహరా కాస్తున్నారు
పంట వాసనేసే మాగాణి తెలంగాణలో
ఫ్యాక్టరీ భూతాలను దించి

విషవాయువు కోరలను సాచుతున్నారు
దగా చేసి తెలంగాణను
దయనీయంగా మార్చినారు
పాలేరు నుంచి కూలి బతుక్కి
పైసల ముగుదాడేసి దిగలాగినారు

ఇంకా ఏముంది తెలంగాణాలో ?
మా తెలువుల్ని తెలివి తక్కువ చేసి
మాట్లాడే
మీ యాస తెలుపులు
పాడు గాను!

అంగళ్ళు పెట్టి ఆగమాగం చేసిన
తెలంగాణా
కంపిన్లు పెట్టి గావరగావర చేసిన
తెలంగాణా

ఇప్పుడు
కొత్త బాణీలో పాటను
సిద్ధం చేసుకోటానికి
అక్షరాలను సమకూర్చుకొంటోంది !

'భూమిక' (తెలంగాణా స్పెషల్)
మే - ఆగస్టు 1998



# కరపత్రం

చెట్టు మీద పిట్ట వాలినట్టుగా,
నా చేతిలో కరపత్రం

ఎక్కణ్ణుంచొచ్చిందో తెలియదు
ఎలా వచ్చిందో అంతు చిక్కదు
పరిశుభ్రమైన పొద్దటి పూటలా
కలం పట్టగానే మెరిసే కొత్త వాక్యంలా
నా చేతిలో కరపత్రం
గుండె అంచుల్ని తొలుచుకుంటూ
వెళుతూంది
అద్దంలో నన్ను నేను చూసుకొన్నట్లుగా
కరపత్రం లోకి తొంగి చూశాను

వేటకుక్కలా రాత్రి
పల్లెల మీద తిరుగాడుతున్న దృశ్యం
కనిపించింది

అమ్మ రొమ్మును నోట్లో పెట్టుకున్నా,
పసిపాప భయంతో వణుకుతున్నట్లే,
కనిపించింది
వీధుల, ఇండ్ల నాడులన్నీ చల్లబడిపోయినట్లు

స్పష్టంగా తెలుస్తున్నది
తల పంకించటానికి కూడా ఊరి నడుమ నున్న
మర్రిచెట్టు
గాబరా పడుతున్నట్టే వుంది
గాలి
రెక్కలు మూసుకొని
ఏ మూలకో బిర్ర బిగుసుకు పోయింది
బూట్ల శబ్దాలు
చావుకు కొట్టే డప్పుల్లా ప్రతిధ్వనిస్తున్నాయి
ఆ వూరి ఆకాశం మీద మొలిచిన
చంద్రుడు కూడా
సగానికి సగం కుచించుకు పోయాడు
కొట్టంలో తరుమబడుతున్న లేగదూడలా
ఆ పల్లెటూరు
ఓ ఇంటి ముందు
గంప కింద పడుకొన్న కోడిమెడపై
సర్రుమన్న కత్తిగాటు...
తన్నిన దెబ్బలకు తలుపు మూలుగు...
ఇంటిమీది గూన పెంకలన్ని
బూట్ల కాళ్ళకింద పరం పరం....



రాజ్యానికి కోపమొచ్చింది
గోడ దూకి పారిపోతున్న
తమ్ముడి వెన్నుపూస తుపాకీ
జారి పోవడం కనిపించింది
క్షణం పట్టిందో లేదో
వీరుడు రక్తం మడుగులో తేలుతున్న
దృశ్యంతో
కరపత్రం బరువెక్కింది
గిర్రున తిరిగిన కన్నీటితో ముఖాని కద్దుకున్నా
కరపత్రాన్ని!
బొటన వేలితో బొట్టు
దిద్దుతున్నట్లనిపించింది....!

ప్రజాసాహితి
జులై 1999

# పత్తులే మరణశయ్యలైన వేళ

బజారు కెళ్దామని
కొక్కేనికున్న అంగి తీసి,
వేసుకొంటున్నప్పుడు,
జేబులోంచి పత్తి గుండెల మూలుగులు
వినిపించాయి

నడుస్తూ నడుస్తూ
ఏదో షాపు దగ్గర ఆగినపుడు-
లోపలున్న మందుల డబ్బాల్లోంచి,
పత్తిపురుగుల వికటాట్టహాసాలు
వినిపించాయి

గదువ ఎత్తి
పత్తి ముఖంలో ముఖం పెట్టి పరీక్షగా
చూసినప్పుడు,
నిషేధింపబడ్డ మందులు అల్లిన
మరణగీతం అలలు
కనిపించాయి
పేపరు పేజీలు తిప్పుతూ
ఇంట్లో కూచున్నా



లోకమంతా అల్లుకుపోతున్న
పత్తి రైతుల మరణ వాసన
మనసుకు తగులుతూనే వుంది

మా ఆవిడ ముట్టించిన
దీపపు ప్రమిదలో రెండు వత్తులు
కాలుతూ
నన్ను నిలదీస్తున్నాయి

రాజ్యాన్ని ఏమని అడగాలి?

మట్టిని ప్రేమించనపుడు
మట్టిలో పెరిగే మొక్కని ఎలా ప్రేమిస్తుంది?
హత్యలు చేయించడానికి
పుట్టిన చేతులు
ఆత్మహత్యల జాలిపుటల చెమ్మనెలా
స్వీకరిస్తుంది?
ఏ రక్తపు ఆనవాళ్ళు అంటక,
ఏ ప్రాసిక్యూషన్ ముందు జవాబు దారీ కాక,
శుభ్రంగా దులుపుకొన్న చేతులెత్తి
రెండు వేళ్ళు చూపిస్తూ
పాలించే సత్తాను రుజువు చేసుకొంటాయి

రైతన్నా! రైతన్నా!

అందరి సంగతేమో కానీ
నువ్వు మాత్రం నేల కోసమే
పుట్టావురా!
నేలలో ఇగురు వేసే బతుకు కోసమే
బతుకు తున్నావురా!
రాజులకు సామ్రాజ్యవాదుల
మొహబ్బతులు కావాలి
అందుకు నిన్నూ, నీ నేలనీ
వాడుకొంటారు
దారప్పోగులు తెంపినంత సులభంగా
బంధాలు తెంపుకోకురా!
నేల మీద ఒరిగిపోయి
నేలను
దిక్కులేని అవ్వను
చేయకురా !!

18-3-1998



# ఒక సహజ సన్నివేశం

షికారు కెళ్ళి వస్తోన్న సాయంకాలం
ఇళ్ళ మీది యాంటెన్నాలకు గుచ్చుకొంది

కాలేజీలో సీట్లకోసం ఎగబడ్డ
స్టూడెంట్ల గుంపుల్లా
చెట్ల మీద చేరడానికి పక్షుల
ఆందోళన
కొనసాగుతోంది

కరెంటు బేడీలు వేయబడ్డ
ఖైదీ బల్బులు
తలొంచుకొని మౌనంగా నేలచూపులు
చూస్తున్నాయి

రోజంతా సమస్యల నరిచీ అరిచీ
కంఠశోష వచ్చిన దినపత్రిక
టేబుల్పై మూర్చిల్లింది

ఆరోజు కూలీ పైసల కోసం
ఆసామీ దగ్గర
చాచిన కొంగై
పడిగాడ్పులు పడుతోంది పల్లె

మన్మథుని విల్లంబులందుకొని
నగరం
ఫ్యాషన్ పరేడ్‌కు బయలుదేరింది

ఎవరో వచ్చి వెళ్ళారంటే
అడుగు జాడల్ని
డైరీలో వెదుక్కుంటున్నాను

కొనుక్కొచ్చిన కొత్త పుస్తకం
అసహనంగా నన్నే చూస్తోంది

గోడ గడియారం
కాలం నెత్తి మీద మరిన్నిసార్లు మోది
చేసేదేమి లేక
వెళ్ళిపోయింది



ఏదో ఒక
శ్రీశ్రీ కవితా వాక్యం గుర్తొచ్చి
శ్రీమతితో గొడవ పడ్డాను

పిల్లల అల్లరిని గదుమాయించి
పక్కమీద చేరింది రాత్రి
బరువైన గాయాల్ని దాచుకొన్న
నా బుక్‌షెల్ఫ్,
మూల్గుతూనే
గుడ్‌నైట్ చెప్పింది
మా వూరి బ్రాహ్మడు
భళ్ళున నవ్వినట్లుగా
తెల్లారింది
అమ్మో.....
పనిలో కెళ్ళాలి....!

ఆంధ్రభూమి డైలీ,
3-12-1998

## జీవితం

చిన్నప్పుడు.......
చెల్లె బొమ్మరిల్లు కడితే,
జీవితం అచ్చం అలాగే వుంటుందనుకొన్నా

అమ్మవూరెళుతూ
ఏడుస్తున్న తమ్మునికి వూరుకొమ్మని
ఇచ్చిన చారాన లా
జీవితం వుంటుందనుకొన్నా

స్కూలు కెళ్ళిన మొదటి రోజున
మాస్టారు బుగ్గ గిల్లి,
ఆ అలు పెట్టిచ్చినట్లుగా
జీవితం వుంటుందనుకొన్నా

కొనుక్కొచ్చిన కొత్త పుస్తకాల
పేజీలు తిప్పుతూ,
వాసన చూస్తున్నట్టు
జీవితం వుంటుందనుకొన్నా

విరిగిన పెన్ను పత్తితో రాయలేక
అవస్థలు పడుతోంటే,



అప్పుడే పట్నం నుంచొచ్చిన నాన్న
సంచీలోంచి తీసిచ్చిన కొత్తపెన్నులా
జీవితం వుంటుందనుకొన్నా

కట్టె పట్టుకొని ఆవుముందు
నిలబడమని,
అమ్మ
పాలు పితుకుతోంటే,
పాలధారల శబ్దంలా
జీవితం వుంటుందనుకున్నా

మబ్బుల లేచి
తెల్లారేసరికి వాకిట్లో,
అక్క వేసిన సంక్రాంతి రధం ముగ్గులా
జీవితం వుంటుందనుకొన్నా

పొద్దున్నే స్నానం చేసి
కళ్ళు కనబడకున్నా పాకులాడుకుంటూ
మడితో మూలకు కూచొని
పబ్బతి పట్టుకొని,
ఇల్లంతా శ్రావ్యమయం చేస్తోన్న
బాపమ్మ భక్తి పాటలా
జీవితం వుంటుందనుకొన్నా

బాయికాడి నుంచొస్తూ
జీతగాడు గడ్డిమోపులో దాచుకొని,
తెచ్చిన రెండు చెరకు గడల్లా
జీవితం వుంటుందనుకొన్నా

సాదుకుంటున్న
బుచ్చి కోడిపిల్ల కాలుకు
గజ్జె కట్టినట్టుగా
జీవితం వుంటుందనుకొన్నా

జీవితం నుంచి
జీవితం పారిపోతున్నట్లుగా
తిరిగి జీవితంలోకి పట్టుకొచ్చి,
నిర్బంధించినట్టుగా
నేటి ఖైదీల వుదాహరణలా

జీవితం వుందని
ఇప్పుడే తెలుసుకొన్నా !

*(నిజామాబాద్ జిల్లా జైలునుండి ఖైదీల పరార్ - వార్తను చదివి, ఖైదీలను సంస్కరించే వూసే లేని ప్రభుత్వ అప్రజాస్వామికతకు కినిసి -)*

మూసీ
*8 - 2000*



# ప్రాణం లేని దినం

గూటిని అల్లిన పిట్ట
ఇంకా గూటికి చేరనే లేదు
మబ్బును విడిచిన వానచుక్క
నేల మీది మొలక తల్లివేరును
తాకనే లేదు

మూతి మీద రెండు కిరణాలు మొలిచిన
అక్వేరియం చేప పాప
ఇంకా ఆక్సిజన్‌ను పీల్చనే లేదు

తోవలో ఎదురుపడ్డ పోస్ట్‌మ్యాన్
అద్దంలా తళతళగా నవ్వి
ఓ కొత్త ప్రపంచాన్ని పరిచయం చేయనే లేదు

సీదా వెళ్తుందనుకొన్న రస్తా
హఠాత్తుగా మూలమలుపు తిరిగి
సగం తెగిన వానపాములా
విల విల లాడుతుందని అనుకోలేదు
పడుకొని, గుండెలమీద పెట్టుకొన్న
పుస్తకం,

రక్త సముద్రంలో సుప్రభాతాలై
తేలనే లేదు
లాంగ్ థెరపీ చికిత్సల నుండి
ప్రభుత్వాలు ఇంకా కోలుకోనే లేదు
గట్ల మీద గడ్డి చిలుకల నోట్లో
పత్ర హరితం మొలవనే లేదు
అగరొత్తుల పరిమళ వాయువులు
గుండె గదులకు వ్యాపించనే లేదు

పంచటానికి సిద్ధం చేసిన
దేవుడి ప్రసాదానికి
మంత్రివర్యు లింకా రిబ్బన్ కట్ చేయనే లేదు

ఆకుల ధైర్యాన్ని కోల్పోయి
పచ్చదనాల బలిదానాల నర్పించి
మొండి దవుతున్న అడవి,
కనురెప్పల తడిగాయాలను తుడుచుకుంటూ
తెప్పరిల్లనే లేదు

వాకిట్లో కురుస్తున్న వెన్నెల
ఆయుధాల భాష నింకా
బట్టీ పట్టనే లేదు

నేనూ, కలమూ కలిసి
ప్రపంచాన్ని చుట్టి వచ్చి,



ఇంకా పద్యాలల్లనే లేదు

ఈ రోజు
నా డైరీ ఖాళీ పేజీలో
తల దించుకొని వుంది.....!

*ఆదివారం ఆంధ్రభూమి*
*20-9-98*

# దేశభక్తి

ఆనందించు, అమెరికా
ఆనదించు!

నీ డాలర్ కాళ్ళ చుట్టూ
బొచ్చు కుక్కలా తిరిగేందుకు,
పతనమైన రూపాయి విలువ అద్దంలో
తన ముఖం చూసుకుంటూ
అసహ్యించుకొంటుంది
అనుబంధాల తాతలూ, తండ్రులూ,
తెలుగు తల్లి ముఖాన మెరుస్తున్న తేజస్సూ
నీ కాంటెస్సా కారుపక్కన
నిలబడలేక
తలలు దించుకొంటున్నాయి

నీ మీదికి గాలి మళ్ళిందంటే
మా వాళ్ళిక్కడ
నాలుగంకెల జీతాలకు పని చేయడానికి
బద్ధకిస్తారు
వైట్ హౌస్ ప్రేమ కలాపాల పురాణాలు



విన్నాక
మా పురుషత్వాల మీద మాకు
నమ్మకం పోయి,
మీ వయాగ్రాల తాయిలాలంటే
నోట్లో నీళ్ళూరుతున్నాయి

నీస్టైల్ చూశాక
మా వందేమాతర గీతాన్ని కూడా
నీ మెహర్బానీ కోసం
ఏ ఫారిన్‌లోనో కూర్చుని
గమ్మత్తైన బాణీలకై కసరత్తులు
ప్రారంభించినాం
'మీ ప్రోఖ్రాన్
నా కంటి ఎరుపుల విస్ఫోటనం కన్నా
గొప్పది కాదులే'

అని నువ్వు బీబీసి టీవంత
నోరు చేసుకొని అరచినప్పుడు,

'మాదీ ఒక దేశమేనా'
అన్న అనుమానం వచ్చే, రాకో
ఎటూ తేలని మనస్కులమై
వుండి పోయాం చూశావా!

'మెడబట్టి మీ భారతీయ
సైంటిస్టుల్ని గెంటేస్తాం'
అన్నప్పుడు కూడా
మేం పూసుకున్న వీరగంధం తాలూకు
స్ఫురణ లేవీ
పొటెత్తలేకపోయాయి
ఇంతకన్నా నీ కింకేం
'గట్స్' కావాలి అమెరికా!
నువ్వు విసిరే వీసా మన్మథ
బాణాలకు
మేం తాళలేకపోతున్నాం
ఇక్కడ
మా మలయానిలం,
మా వసంత కోకిల గీతాలూ,
మా శరత్కాల వెండి చంద్ర బింబం
ఎంత మోటుగా వున్నాయో?
గంజిలో మెతుకులు ఏరుకుంటున్న
మనిషి
ఇంకా మా దేశంలో
తిరుగాడుతున్నాడంటే
మా సంస్కృతేం ఏడ్చిందసలు?



మువ్వన్నెల జండా ముడి
విప్పినప్పుడు
మా దేశభక్తి, పువ్వుల్లా
రాలి పడుతుంటుందిలే
వాటి మీంచే నడచి వస్తున్నాం అమెరికా,
నీకు షేక్‌హాండ్ ఇవ్వడానికి!!!

ఆంధ్రప్రభ వీక్లీ
29-3-99

# దినచర్య

శిఖరం మీంచి వర్షపుజల్లు
జారుతున్నంత సునాయాసంగా
నిద్దుర రాత్రుళ్ళుండవు

పసివాడు కిలుక్కుమని
నవ్వినంత అందంగా
కలల కేరింతలుండవు

గడియారం
ఒంటికాలు లాంటి ఒంటిగంట మీద
నిలబడి,
జడ్జి ముందుకు రాని కేసులా
శిక్ష ననుభవిస్తూ వుంటుంది

డబుల్ కాట్
భీష్మ పితామహుని అంపశయ్యను
పోలి ఉంది

బెడ్ రూం
లాకప్ సెల్‌ను గుర్తుకు తెస్తుంది.
లైట్ వెలిగించా



విరబోసుకున్న చీకటి
గోడ కతుక్కున్న బల్లి అయ్యి,
వేటకారి నేర్పరి తనంతో
పొంచి చూస్తుంది
ఎర్రబడ్డ కళ్ళలా రెండు దిండ్లు
కవిత్వం రాయని కాగితంలా
మూతి ముడుచుకుని
కూచున్న దుప్పటి -

ఆదుకోలేని నిస్సహాయ కూరుల్లా
ఆవలింపులు -
వంచిన తల ఎత్తకుండా
అప్పజెప్పిన పనిని చేసుకుంటూ పోయే
అమాయకుడిలా
పాపం ఫ్యాను!

కల్మష మంటని నిద్దురలో
రేపటి బలాన్ని శ్వాసిస్తున్నారంతా

ఇంత రాత్రి
నేనిప్పుడు ఎవరి హృదయంలోకి
చొరబారి, గొడవ చేయనూ?

వెలుగు నోచని అముద్రిత
గ్రంథంలా

నా గాథ పుట్టలోనే
వేడి నిట్టూర్పులు విడుస్తుంటుంది

పాలవాడు పేపర్ వాడు
ఉదయాన్ని
ఇంటింటికీ పంచుకుంటూ వెళతారు

తలారా స్నానం చేసినంత
తృప్తిగా
అందరూ పనిలోకి బయలుదేరుతారు

బరువెక్కిన రాత్రిని
కళ్ళమీద మోస్తూ
కిరోసిన్ డబ్బా పట్టుకొని క్యూలో
నిలబడతాను నేను!

9-12-1998



# అమ్మకు క్షమాపణలతో....

నిలువెత్తుగా ఎదిగిన అమ్మముందు
మరుగుజ్జంత నేను పూర్తిగా ఓడిపోయాను

............ ............ ............

బతిమిలాడుతూ గోరు ముద్దలు తినిపించిన
అమ్మ చేతులతో,
ఇప్పుడు పాచిపని చేయించుకుంటున్నాను

బడి నుండి రాగానే నన్ను చూసిన
ఆనందంలో మిల మిల మెరిసిన
అమ్మ కళ్ళలో,
ఇప్పుడు కన్నీటి ముండ్లు మొలిపిస్తున్నాను

తొమ్మిది మాసాలుగా కడుపులో దాచుకొని
ఎనలేని కడుపు తీపిని పంచిపెట్టిన
అమ్మ జానెడు పొట్టకు
రుచుల్ని పరిచయం చేయలేకపోయాను

జోలపాడి, ఊరడించి, నిద్రపుచ్చిన
అమ్మనోటికి
'వాగొద్దు' అని తాళం పెట్టినాను
కంటికి రెప్పలా కాపాడుతూ నన్ను పెంచిన

అమ్మనిప్పుడు,
నా ఇంటికి కావలి కుక్కను చేసినాను

నా బతుక్కి బంగారు బాట వేసిన
అమ్మ
నా కుటుంబ వ్యవహారాల్లో తల దూర్చి
సలహాలివ్వబోతుంటే,
'చాదస్తపు' 'ముసల్ది' అని కసురుకున్నాను
రాగద్వేషాలు అంటకుండా నన్ను సాకిన
అమ్మ
ఇంటి కోడలిని 'సాధిస్తున్నద'ని అనుమానపడ్డాను
నా పిల్లలకు
చాకిరి యంత్రంలా, ఆట వస్తువులా -
వాళ్ళు తిట్టినా, కొట్టినా
అరవలేని వృద్ధ గడియారం లా -
వుండిపోయిన అమ్మను,
మౌనంగా చూస్తూ వుండిపోయాను

అనర్గళంగా, చెప్పిన కథను చెప్పకుండా
రాజుల కథలు, దయ్యాల కథలు
నాకు చెప్పిన అమ్మ
నా సంతానానికి చెప్పే అవకాశమివ్వకుండా
రంగు రంగుల ఛానల్స్‌ని ఇంట్లో కొనిపెట్టాను



నాన్నకు తద్దినం పెట్టిన రోజు
'ఒక లీవ్ పోయిందే'
ఆదివారం వస్తే బాగుండు' అన్నప్పుడు,
నాన్న ప్రతిబింబమున్న అమ్మ మనసు
ఎన్ని ముక్కలై యుంటుందో ఊహించలేకపోయాను

ఆనాడు అమ్మ ఇల్లంతా దేవతలా
కలియ దిరిగితే,
ఈనాడు పిల్లిలా బెరుకు బెరుగ్గా
తిరుగుతూ
అందరూ దూరం కొడుతుంటే
ఏమీ చేయలేకపోయాను
నాకోసం ఒక జీవితకాలం
శ్రమించిన అమ్మ దగ్గర
పట్టుమని పది నిమిషాలు కూచొని,
అమె మనసును మునివేళ్ళతో నన్నా
కళ్ళ కద్దుకోలేకపోయాను

ఇంత చేసినా
నన్ను ఇప్పటికీ
'అడ్డాల నాటి బిడ్డవే'రా
అంటుంది అమ్మ
'అందరి ముందు గెలవాలిరా'

అన్నవి అమ్మ మాటలు -
ఒక్క అమ్మ ముందే
గెలవ లేక పోయాన్నేను !

ఎక్స్‌రే - 1997
ఉత్తమ కవితా ప్రశంస
ఆంధ్రజ్యోతి వీక్లి
26-5-2000



# ఒకింత ప్రేమ కోసం

అంగీకరించడానికి కుదరదు
రంగులద్దిన మనసు పుష్పాన్ని
చుంబించాలంటే,
ససేమిరా నచ్చదు
నిశినీడల్ని వడపోయ నియ్యకుండా
కిటికీ అద్దాల మీద
గుడ్డికళ్ళ చూపులు అంటుకుంటే,
వూరుకో బుద్దికాదు
మరో ప్రపంచపు గీతాల్లాంటి

ఆకుపచ్చని ఆకుల మీద
భారతదేశపు బానిసత్వాల
నల్లటి మచ్చల్ని చూస్తే,
ప్రశాంతంగా వుండదు

ఊపిరి వేళ్ళతో గీయని
కంప్యూటర్ కళాఖండం
డిజిటల్ నవ్వులొలుకుతుంటే,
సహించదు

ఆకాశం బరువెక్కువై
పడిపోతున్నట్లుగా వంగుతుంటుంది
భూమి ఇరుకై, తలదాచుకోటానికి
ఖాళీ పేజీని వెతుక్కుంటుంది
పిచ్చివాడు మనలతో
మాటలు కలుపుతుంటాడు
అయినా పట్టించుకోం
ఎక్కడ నడుస్తున్నా
అమ్మకాల వాసన పిలుస్తున్నట్లుగా వుంటుంది

పిల్లవాడు బొమ్మ వేసినంత
ఆనందంగా
మనుషులు సంభాషించుకోవటం
కనిపించిందా?

పక్కన పండుకోబెట్టుకున్న
మిత్రుని లాంటి వాళ్ళింకా వున్నారా!

సాఫ్ట్‌వేర్ హార్డ్‌వేర్ మధ్యన
మనిషి జీవితం
కంప్యూటరైంది
జీవితంలోని సున్నిత అంశాలకు
రిమోట్‌లో మీటలు లేవు



సాయంత్రాలు బైటకెళ్ళటం
అలవాటు చేసుకొన్నాను
చెట్లమీది పిట్టల గుంపుల్లా
జనాన్ని చూడటం
మహా ప్రీతిగా వుంటుంది నాకు -
సందు చేసుకుంటూ
జనాన్ని స్పర్శించుకుంటూ
ముందుకెళ్తుంటాను
నది ఒడ్డున కూచొని,
చిన్న చిన్న అక్షరాలను
నదిలోకి విసురుతూ

ఆవేశపడే కెరటాల్నీ,
సముద్రం పారుతున్న శైలినీ
తమకంగా చూస్తుంటాను
అనూహ్యంగానే ఓ కెరటం
ఎగిరొచ్చి
నా ఒళ్ళో పడుతుంది
ఉలిక్కిపడి చూద్దును గదా
కెరటంతో పాటే ఎగిరొచ్చిన
చేపపిల్ల,

నా ఒడిలో గిల గిల కొట్టుకుంటుంది
పద్యం లాంటి ఆ చేపపిల్లని
అపురూపంగా చేతుల్లోకి తీసుకొని
నీళ్ళలోకి నడుస్తాను
క్రమంగా ఒక ప్రేమ
విస్తరించీ
విశ్వవ్యాప్తమౌతుంది....!

*24-09-1998*



# మళ్ళీ మొదట్నుంచీ...!

జాడలన్నీ కన్నీటి మడుగులయ్యాయి
దారులన్నీ మంటలై అంటుకున్నాయి
స్వరం తెగి, పాట బొట్లు బొట్లుగా
హత్యకు గురౌతుంది

ఈ నిశీధి ప్రపంచాన్ని ఏలడానికి
ఎవరు ముందుకొస్తారు?
ఈ నల్లసరపు గుండును ఎంత పొర్లించినా
దానికి చెమటే పూరదు

రెండు మిడుత గుడ్లేసుకుని ఒక తీతువుపిట్ట
కీచుమంటూ అరుస్తూ,
మనమీంచి వెళ్ళిపోతుంది

అలమటిస్తున్న ఆకలికి
ఎవడు వేడి వేడి బతానీలూది తినిపించగలడు?
మనం నడిచిన సురుచిర సుప్రభాత
మైదానాల నన్నీ
ఎవడో జేబుల్లో మడిచి పెట్టుకొంటూ
చక చకా నడిచెళ్ళి పోతున్నాడు

గుండుసున్న శూన్యంలా
నోరు తెరచుకొని
మాటల్లేని దిగంబరుల మయ్యాం
సుకుమారంగా
రెండు ఆకులు కదిలినంత
శబ్ద సంచలనాన్నైనా
చేతులెత్తి గుప్పించలేకపోతున్నాం

అపార్థాల రంగు పులుముకొని
స్టేజిపై నటించే దశలో,
జీవన పాత్రల విలువలు మరిచిపోగా
అనర్థాల దేహశుద్ధిగా మిగిలాం

అవిశ్వాసం మానవ పర్యాయ పదమై,
నూరేళ్ళతో నేసిన పట్టు జీవితాన్ని
కుళ్ళ పొడుస్తుంది

ఇప్పుడు
మనల్ని నెత్తిమీద మొట్టటానికి
ఎక్కడైనా ఓ రెండు చేతులు సులభంగా
మొలవ్వొచ్చు
దాటుతున్న మజిలీలన్ని,
పుర్రెల హారమై
చరిత్ర మెడలో వేలాడుతూ



వికటాట్టహాసం చేస్తున్నాయి
గ్రాంధికంగా నటిస్తూ
గద్గదికంగా నడుస్తున్నాం
ఇప్పుడు మానవ హృదయం
తీయని అనుభూతుల కలశం కాదు
రకరకాల ప్రయోగాల బుసబుసల లాబొరేటరీ -

ఇప్పుడు మానవ మేధ,
సమస్యల నంతమొందించే కాంతిపుంజం కాదు
వినాశకర విస్ఫోటన డైనమేట్ -

లిపిలేని నవ్వులూ,
రెండంచులా బుద్ధులూ,
అస్పష్ట ఔటర్‌లైన్ ఆకారమూ
వెరశి - నేటి మనిషయ్యాక

కరుకుదనం తప్ప
'చెరకు'దనానికి తావెక్కడిది?

ఆటవి'కప్పురం' ధూపానికీ,
నాగరి'కంపు' కార్బన్ పొగలకీ
తెలివిమీరిన తనమేనా కొలబద్ద?

మళ్ళీ మొదలెడదాం

వెనక్కెనక్కిపోయి, మొదటికెళ్ళి
తల్లి గర్భాశయ గోడల ప్రేమైక మావి చుట్టూ
నిండి పోయి,
తల్లి మమతల చనుబాల రుచితో
తల్లి కడగళ్ళ కన్నీటి ఉప్పుతో

మళ్ళీ మొదలౌదాం....!
మళ్ళీ మొదలౌదాం....!

16-02-1994



# మౌనాన్ని బద్దలు కొట్టు

మౌనాన్ని ప్రేమించలేను
అలలుగా విస్తరించీ, పాదాల్తో గుసగుస లాడుతూనే
నిలువెత్తు కెరటమై మింగేస్తుంది
మాటల వైభవాన్ని కొల్లగొట్టి, నన్నొక
పాడుబడ్డ పల్లెని చేస్తుందని ఎరుకే -

కరుగుతూ వుండే కాలం మంచుగడ్డ,
మౌనంతో ఘనీభవించి 'శిలా' పర్వతమౌతుంది
గాలిరెక్కల్ని తెగేస్తుంది మౌనం
నీటిగొంతుక స్లోగన్‌లను మూయిస్తుంది మౌనం

ఇల్లాలి గాజుల గలగలలో వినబడే
అనంత సంసార బాదర బందీని,
సహించలేకపోతుంది మౌనం

ఆకూ ఆకూ రాచుకొని శబ్దమై
పేలుతుందని భయపడుతుంది మౌనం
మౌనం, మబ్బుల్లో దాచుకొన్న
ఏడుపు
మౌనం, గొంతు లోయల్లోకి జారిన గాయాల

మూట

మౌనం, పాటల్ని దోచుకొని వెళ్ళగొట్టిన

కోకిల ఆక్రోశం

మౌనం గాలికి, జీవన పరిమళం

కొట్టుకుపోతుంది

జస్ట్, బిందువు లాంటి మౌనం

సుదీర్ఘ జీవితమంతా పాకుతుంది

పాకి, పుష్పించే వందేళ్ళ చరిత్రని ధ్వంసం చేస్తుంది

మౌనం కొండ చరియల్లా మీద పడే ముందు

గొంతెత్తి బిగ్గరగా కవిత్వం పాడతా

అంతే!

మౌనం వెయ్యి ముక్కలౌతుంది !

28-9-1988



# అవిశ్వాసమే శ్వాసగా....

అవిశ్వాసాన్నే శ్వాసగా పీలుస్తున్న

మనిషి,

అంతరంగంతో ఎలా మాట్లాడగలడు?

ఏ అంతరంగాన్నైనా ఎలా కదిలించగలడు?

చెట్టు కొమ్మన వూయల వూగుతూ,

వేళ్ళతో తడి కబుర్లై ఎలా అల్లుకోగలడు?

గొడుగు కింద కూచున్నాక,

ఒరం మీద నడుస్తున్న గిరిజన స్త్రీ

నెత్తి మీది గడ్డిమోపు బరువును

ఎలా అంచనా వేయగలడు?

వేటగాన్ని చూసిన,

పిడికెడంత పిట్ట ఆందోళనా రాగాన్ని

పాటంటే పడినప్పుడు

ఎలా స్వీకరించగలడు?

సముద్రాన్నీ, సముద్ర తీరాన్నీ

విహార స్థలంగానే భావించినప్పుడు

బతుకులోని విశాలతనీ,

అగాధాన్నీ

ఎలా గుర్తించగలడు?
అకాశాన్ని తేరిపార చూడలేనప్పుడు,
చుక్కల్లో మిణుకు మిణుకు మంటున్న
రేపటి ఉదయాల్నీ
ఎలా చూడగలడు?
చెప్పుకింద నలుగుతున్న
మట్టి ఊపిరుల్ని,
గుండె చాటున ఆరబెట్టుకుంటున్న
ఉద్యమ ఆవిరుల్ని
ఎలా ప్రేమించగలడు?
అవిశ్వాసం అడుగులతో
నడుస్తున్న మనిషి తల మీద
కాంతివంతమైన ఆకాశము సంచరించటానికి
ఒప్పుకోదు
అతని ముంగిట్లో వసంతాలు, ముగ్గులై
పరచుకోవు
అతడు నడుస్తున్నంత మేరా
పచ్చగడ్డి ఆత్మహత్య చేసుకొంటుంది
అతనెక్కడ కనబడినా
ఏ రెండాకులైనా సరే, ముఖాలు చిట్లించి
పక్కకు తప్పుకుంటాయి
అతని అవిశ్వాసం వాతన పడ్డ



వాళ్ళందరూ
దెబ్బ తిన్న పులులౌతారు
అవిశ్వాసానికి వశమైన అతన్ని చూసి,
భౌ భౌ అని అరుస్తూ
వీధి కుక్క
వెంట పడుతుంది....!

"మూసీ"
11/1998

# పూలమ్మి

గుండెలు తాకితే తెలుస్తుంది
పూల మృదుత్వం, మనస్తత్వం -
పరిమళాలు అంతటా ప్రవహిస్తాయి
ఒక్క ఆమె ముడుతల బతుకులో తప్ప -
ఆమె పూలేరుతుంది, దండలల్లుతుంది
గడప గడపకీ తిరిగి అమ్ముతుంది
ఇండ్లలో, తలలో, మనసులో, చివరికి బతుకులో
పరిమళాన్ని నింపి
ఖాళీ బుట్టతో, కాసిన్ని పావలా పైసల్తో
రెక్కలూడిన ఒట్టి పువ్వు కాడలా తిరిగొస్తుంది
పూలలో
తన మమతను పరిమళంలా నింపిందేమో
కరుణ, జాలి, వాత్సల్యం రంగులుగా అద్దిందేమో
కన్నీటిని మకరందంలా ఒంపిందేమో
మొత్తం ఆమె జీవితాన్నే పువ్వులా ఎత్తిందేమో
చెవిలో ఆమె పువ్వే పెట్టుకొని
భక్తుడౌతుంటాడు ఒకడు



జడలో ఆమె దండే ముడుచుకొని
భర్తకు దగ్గరౌతుంటుంది ఓ ఇల్లాలు
మెడలో ఆమె దండె వేసుకొని
రోగులకు పళ్ళు పంచుతుంటాడో నాయకుడు
ఉత్సవ విగ్రహాల ఊరేగింపులకు
ఆమె పూలే కావాలి
పెళ్ళి పేరంటాలకు ఆమె పూలే కావాలి
శవానికి సైతం ఆమె పూల గుభాళింపులే ముఖ్యమట
కొట్లో పూల గుత్తులు కనిపించినప్పుడల్లా
యాసిట్లో ముంచిన ఆమె ముఖమే
తోస్తుంది నాకు
వేలాడ దీసిన పూల దండల్లో
జీవచ్ఛవమైన ఆమె కంకాళమే
దర్శనమిస్తుంది నాకు
దేంట్లోనూ బంధించలేని ప్రాణం లాంటి
పరిమళాన్ని
అందరికీ పంచుతున్నప్పటికీ
ఆమెకు మిగిలింది
ఏకాకితనం
గుప్పెడు కన్నీళ్ళు
ఆమెను ఓదార్చడానికి ఏ పువ్వూ
ప్రయత్నించదు

ఉన్నన్నాళ్ళూ పువ్వులాగే
మనందరి గుండెల్లో గుప్పుమంటూ
పరిమళిస్తూ వుంటుంది
పోయాక,
పెంటకుప్పపై విసిరేసే నలిగిన పువ్వు లాగే
ఆమెని కూడా....

*ఆంధ్రజ్యోతి డైలీ (నవీన)*
*2-3- 1998*



# తీగెల ఉరి

తిరగడాని కిష్టపడని ఫ్యాను
కోర్టు బోనులో నిలబడ్డ ముద్దాయిలా
మౌనంగా తలొంచుకుంది

ఛానళ్ళ సంబరాలు జరుపుకొనే టీవీ
మధ్యలో వచ్చిన యాడ్‌లా
మూడాఫ్ అయి కూచుంది

తడిసి ముద్దయిన ఫ్రిజ్
పల్స్‌రేటు చేసుకుంటూ,
నిలువెల్లా వణుకుతుంది

మట్టిలో ఆడుకుంటున్న చిన్నోన్ని
బెదిరించినట్లుగా,

గదిలోని హండ్రెడు బల్బుకి
చీకటి దుఃఖపు తెర కమ్మింది
వంటింట్లో పాడి పాడి రాగాలు తీసే
మిక్సీగ్రైండర్,
ఇల్లాలి లో, హైవోల్టేజి రుసురుసలు చూసి
ధైర్యంగా నోరెత్తలేకపోయింది

నాభి లోపలి నుండి

నీళ్ళు తోడిన మోటర్

అనకొండ అయి

పంటనీ, పొలాన్నీ మింగేసే రోజులొచ్చే

ఎక్కడ చూసినా తీగల ప్రకంపనాలు -

తీగెలుగా సాగిన జలతారు వెలుగుల కలల్ని,

కలవరపెడుతున్న తీగెల భయాలు -

ఒక్కతీగ,

రెండు ముక్కలై

ట్రాన్స్‌కో, జెన్‌కో విషపుకోరలుగా సాగిన

వైనం -

ఎనకట రాజు మారువేషంలో

తిరుగుతూ

ప్రజల బాధలను రహస్యంగా తెలుసుకునే వాడట!

ఇప్పుడు

మార్కెట్ ఎకానమీ మన భగవద్గీత!

ఖరీదైన కరెంటు వెలుగుల్లో

మనిషి తన జాతకాన్ని తిరగరాసుకుంటున్నాడు!

5-10-2000



# బస్టాండు

ఏమో

ఎక్కడెక్కడ ఏమేమౌతుందో

గుండె చిక్కువడిన దారపుండలా

ఎంతకూ ఒక కొలిక్కి రాకుండా వుంది

గొడవలన్ని

మాడి మసైపోనూ....!

పూదియ్యని కూరాడులా

వెల వెల బోయే బతుక్కి

మెడ మీద కూచునే ప్రయాణాలొక్కటి !

బస్టాండు అవస్థని కళ్ళారా చూస్తే

వేదాంతంలో అయితే నవ్వుని

సీరియస్‌లో అయితే కోపాన్ని

తెప్పించడం ఖాయం -

ముందుకీ వెనక్కీ పరుగుల మోత -

లిటిల్ మాస్టర్ని తృప్తిగా

'పాసైనా' పోనియ్యరు

అరకప్పు టీ ని అమాంతం వదిలేసి

పరిగెత్తే ఆరాటం -

ఇంత దూరం వచ్చినా
చార్జీలు అప్పు తెచ్చిన
చోటనే
మనసు కూలబడి మూల్గుతూ వుంది

పోతున్న ఇంటోల్లకు
ఓ బ్రెడ్డో
ఐదారు అరటిపండ్లో కొనుక్కెళ్ళకపోతే
ఏం మర్యాదగా వుంటుందసలు?

ఆత్మీయతల్ని
ఆలింగనాల్లో అపురూపంగా
ఆస్వాదించే రోజులేనా....?

నీళ్ళతో నన్నా గొంతు తడుపుకుందామనుకుంటే
'ఫుల్‌చాయ్' తాగితేనే
'సింగిల్‌గ్లాసు' నీళ్ళిస్తానన్న
హోటల్‌వాని తిరస్కారానికి
నాలుకమీది దప్పి, పగిలిన నీటి బుగ్గయ్యింది
పువ్వుతెంపి, తల్లో పెట్టుకునేంతలో
రెక్కలూడిపోయినట్టు,

సంధించిన బాణం తీరం చేరే లోపే
చతికిల బడినట్టు,
ఐస్‌ఫ్రూట్ కరిగిపోయి
పుల్లే మిగిలి పోయినట్టు



గంటలకు గంటలు శూలాలై
మోకాళ్ళ మీద దిగగా
బతుకు నీల్గుతూ వుంటుంటే
బస్టాండు మాత్రం

అమాయకంగా ముఖంపెట్టి
నంగనాచిలా నిలిచే వుంది....!

15-5-1996

# చిట్టి మనసు

అమ్మా
నీకు నాకు మధ్య వున్న
తీయని పేగు బంధాన్ని
కంప్యూటరీకరించ బోతున్నారమ్మా

నన్ను నీ ఒడి నుంచి
తెంపివేసి
అద్దు తెరల ఛానళ్ళు గీస్తున్నారమ్మా
నువ్వు నన్ను బజ్జుండ బెట్టడానికి
పాడే లాలిపాటలు
ఈ హైటెక్ యుగంలో
గిరాకీ లేని సరుకులైనాయమ్మా

గర్భంలో వుండగానే
నా లేత శరీరం ముద్దపై
రంపపు స్కానింగ్ దాడులు జరుపుతున్నారమ్మా

తట్టుకోగలనా అమ్మా
నీటి పాయ మీద అడుగులు నేర్చుకుంటున్న
చిగురు పువ్వును గదమ్మా
కవి మదిలో పూర్తిగా పెరుకోని
భావచిత్రాన్ని గదమ్మా



తల్లిపాల వారోత్సవాలకు
మానవ క్లోనింగ్ ప్రయోగాలకు
నట్ట నడుమ నన్ను
నిలువుకోతగా నిలబెట్టారమ్మా

నువ్వు చెప్పిన బాలనాగమ్మ
కథలో
మాయల ఫకీరు గుర్తొస్తున్నాడమ్మా
ఈ కంప్యూటర్ ని చూస్తుంటే -

అంకెలు తప్ప
ప్రేమలు తెలియని ఇది
బతుకుల్లోకి చొరబారి
మానవ సంబంధాల్ని
లెక్కల మయం చేస్తున్నదమ్మా
అమ్మా
నేను కంప్యూటర్ చదువనమ్మా
మోసకారి పరాయోడి ప్రతిభకు
వంగి వంగి
నమస్కరించే కన్నా
మమకారంతో
నువ్వు మట్టి పలకపై నాటిన
తీపి అక్షరాన్నే
దిద్దుకొంటానమ్మా!

ఉత్తరాంధ్ర
డిశంబర్ 2000

# తల్లి ఆక్రోశం

అమ్మ గర్భం కన్నా
అడవి గర్భం విశాలమైందని
అనుకొని వెళ్ళిపోయావా బిడ్డా

ఇరుకు గోడల ఇల్లు నచ్చక
వనసీమల వాకిళ్ళకు ముచ్చట పడి
వెళ్ళిపోయాక బిడ్డా

ఆడుకొన్న చిర్రగోనెను వదిలేసి
తుపాకీ ఆట మీద మనసుపుట్టి
వెళ్ళిపోయావా బిడ్డా

ఎక్కడ తొట్లె వూగుతున్నా
నువ్వే వూగుతున్నట్లు వుంటుందిరా
ఎక్కడ పిల్లల ఆటల్లో కొట్లాట అయితే
గద్దిస్తున్న నీ గొంతులాగే వినిపిస్తుందిరా

పొయ్యి ముందు కూర్చొని
ఉడుకుతున్న అన్నంకేసి చూస్తుంటె
కంచం పట్టుకొని, అన్నంపెట్టుమని
నువ్వు చేసిన హఠమే గుర్తుకొస్తుందిరా





నువ్వు అంబాడిన నేల మీద
నువ్విప్పుడెట్లా వున్నావో
ఊహించుకుంటూ గీసుకొన్న బొమ్మల్లో
నిన్ను తృప్తిగా నిమురుకుంటున్నాంరా

మా కిక్కడ రోజులు
తెల్లారటం, పొద్దీకటం లాగానే
సాగిపోతున్నాయి బిడ్డా

నువ్వక్కడ
తూటాలు లెక్కబెట్టుకుంటున్నావో
తుపాకీగొట్టం నుంచి కన్నుపెట్టి,
మహాకవి ప్రపంచానికి కలల పునాదులు
తవ్వుతున్నావో
ఆకలి పేగులతో
విప్లవ బాణీలు కట్టుకుంటున్నావో
అలీవ్ గ్రీన్ దుస్తుల్లో ఆరని వుద్యమమై
ఉరుకుతున్నావో
ఎవరైనా నీ మిత్రుడు ఇంటికి వస్తే,
నువ్వే వచ్చినట్టు,
నా అమ్మతనం చనుబాలై కురుస్తుందిరా

నీ గురించి ఏ దుర్వార్తల నైనా
మొరుగుతాయెమో ననీ

రేడియో, టీవీ, పేపర్లను దూరంగా తరిమేసినామయ్యా
పొద్దంతా
వాకిట్లో ముగ్గులమై

రాత్రంతా
వెన్నెల దీపాలమై
నీకోసం ఎదురు చూస్తున్నాం బిడ్డా

రావడానికి వీల్లేకుంటే మానే -

పత్రికల్లో
చితికిన శవాల మధ్య
ఫోటోవి కావొద్దు తండ్రీ

అందరి తల్లుల ఆయుస్సు పోసుకొని
బతుకు బిడ్డా

నిలబడ్డ తుపాకీ వయ్యా.....
కొట్టుకొంటున్న
జనం నాడి వయ్యా....!

మే 5, 1998